# సుభాషితరత్నాలు

(తెలుగులో సుప్రసిద్ధ శతకపద్యాలు - సుభాషితాలు
తాత్పర్య సహితంగా)

సంకలనం - వివరణ

**డా॥ నొస్సం నరసింహాచార్య**

ఉపసంపాదకులు, ప్రచురణల విభాగం, తి.తి.దే.

ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2017**

# SUBHASHITHARATHNALU
**with Commentary**

**by**
**Dr. Nossam Narasimhacharya**

T.T.D. Religious Publications Series No. 1965


*First Print :* 2017

Copies : 1000

*Published by*
**Sri ANIL KUMAR SINGHAL,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507

***D.T.P:***
Publications Division,
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507

# ముందుమాట

తెలుగు పద్యాన్ని తెలుగు ప్రజలవద్దకు తీసుకపోయిన సాహిత్య ప్రక్రియలో శతకప్రక్రియ ఒకటి. ఏ భాషలో లేనన్ని శతకాలు తెలుగుభాషలో దర్శనమిస్తాయి. తెలుగుశతకాలు పలుకులరాణికి పద్యరత్నాలు పొదిగిన బంగారుపతకాలు.

తెలుగుశతకాలలో నీతిశతకాలు సముచిత స్థానాన్ని సంపాదించుకుని ప్రాచుర్యం పొందాయి. అలాంటి నీతిశతకాలలో సుమతిశతకము, వేమనశతకము, భాస్కరశతకము, కృష్ణశతకము, దాశరథిశతకము, శ్రీకాళహస్తిశతకము, భర్తృహరినీతిశతకము, కుమారశతకము, నరసింహశతకము అనే తొమ్మిదింటిని ఎంపిక చేసుకుని, వాటిలో రెండు వందల పద్యాలను ఏరి, వాటికి తాత్పర్యం సంతరించి అందించిన గ్రంథం ఇది. ఈ గ్రంథం పేరు సుభాషిత రత్నాలు. గ్రంథకర్త డా॥ నొస్సం నరసింహాచార్య, 'సుభాషిత రత్నాలు' లోని నీతిపద్యాలకు సరళంగా సుందరంగానే గాక, ధీమాన్యులను మొదలుకొని సామాన్యులను కూడా చదివించే చక్కని శైలిలో తాత్పర్యం రచించారు డా॥ నొస్సంగారు.

మన పూర్వులు మంచిమాటలను (సుభాషితాలను) లయబద్ధమైన అంటే ఛందస్సులో పద్యాలుగా అక్షరంగా అందించి వాటికి శాశ్వతత్వం కల్పించారు. సుభాషితాలు సార్వకాలీన ప్రయోజనకారులు. ఈ సుభాషితరత్నాలు నీతి అనే కాంతులను విరజిమ్ముతాయి.

ప్రసిద్ధ శకతపద్యాలలోని సుభాషితరత్నాలను బాలలు చదివి, పద్యాలను తాత్పర్యంతోపాటు నేర్చుకొని, అందులోని ధర్మాలను, ఆధ్యాత్మికతను వారి మనఃఫలకాలపై ముద్రించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

నైతిక ధార్మిక మార్గంలో సంచరించేవారికి ఈ చిరుపొత్తం కరదీపికగా ఉపయోగపడుతుంది.

బాలలను ఉద్దేశించి తి.తి.దే. రూపొందిస్తున్న ఈ గ్రంథాన్ని తల్లిదండ్రులు పిల్లలకు నేర్పి వారి భవిష్యత్తుకు బంగారుబాట వేయగలరని ఆశిస్తూ శ్రీవారి ఆశిస్సులు సదా వారికి ఉండాలని కోరుకొంటూ...

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

# ప్రవేశిక

మహామహోపాధ్యాయ
**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**
తిరుపతి.

**ఇదమంధం తమఃకృత్స్నం జాయతే భువనత్రయమ్ ।**
**యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే ॥ (కావ్యాదర్శం)**

శబ్దమనే జ్యోతి వెలగని పక్షంలో ఈ ముల్లోకాలూ అంధకారమయమై పోతాయని మహాకవి దండిమాట.

శబ్దరాశివల్లనే వాఙ్మయం రూపొందింది. అక్షరాల సంయోజనంతో శబ్దాలు ఏర్పడతాయి. జాతిపురోగతికీ, మనుజుల ఆత్మోన్నతికీ ఉదాత్తమైన వాఙ్మయం ఎంతగానో ఉపకరిస్తుంది.

ఏ భాషలోనైనా అక్షరాల సంఖ్య పరిమితమే. కాని వాటి అన్యోన్య సంయోగంవల్ల రూపొందే సారస్వతానికి ఎల్లలుండవు. సంగీతంలో ఉండేవి సప్తస్వరాలే. వాటి సమ్మేళనంవల్ల సంభవించే గేయవైచిత్రి మాత్రం అనంతమైనదని మాఘమహాకవి చెప్పాడు.

**వర్ణైః కతిపయైరేవ గ్రథితస్య స్వరైరివ ।**
**అనంతా వాఙ్మయస్యాహో! గేయస్యేవ విచిత్రతా ॥ (శిశుపాల వధ)**

వాఙ్మయ మనే వృక్షం శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది. అలా విస్తరించిన శాఖలలో శతక వాఙ్మయశాఖ ఒకటి.

ఆంధ్రవాఙ్మయ పురోగతిలో సంస్కృత సాహిత్యం నిర్వహించిన పాత్ర ముఖ్యాతిముఖ్యమైన దనడంలో సందేహం లేదు. సంస్కృతంలో

అనేక శతకాలు ఆవిర్భవించాయి. అయితే ఆంధ్ర భాషలో విస్తరించినంతగా శతకవాఙ్మయం సంస్కృతసాహిత్యంలో విస్తరించలేదు.

శతకాలు తెలుగులో క్రీ.శ. 12వ శతాబ్దం నుండి వర్ధిల్లాయని పరిశోధకుల నిర్ణయం. ఆ కాలంలోనే కాక ఈ కాలంలో కూడా శతకాలు కొల్లలుగా తెలుగులో ఆవిర్భవిస్తూనే ఉన్నాయి.

కవితావాసనగల రచయితల్లో అనేకులు శతక రచనతోనే తమ కవితావ్యవసాయం ప్రారంభిస్తారు. కవిత్వం సమగ్రమైన పరిణతి సాధించిన పిదప శతకాలు రచించినవారు గూడా లేకపోలేదు. శ్రీకాళహస్తీశ్వరశతకకర్త ధూర్జటి ఈ రెండవ కోవకు చెందినవాడు.

ఇంచుమించు నూరు పద్యాలకు పరిమితం కావడం వల్ల ఈ కృతులకు శతకాలు అనే వ్యవహారం ఏర్పడింది. సంఖ్యానియమంతో పాటు, వృత్తి నియమం, మకుట నియమం మొదలగునవి గూడా శతక నిర్మాణంలో పాటింపబడతాయి.

పూజాదులలో 108 నామాలతో భగవంతుణ్ణి అర్చించడం కద్దు. ఆ సంప్రదాయమే 100 లేక 108 పద్యాలతో శకతాల నిర్మాణానికి దారి తీసిందని భావించవచ్చు.

భగవత్ స్తోత్రరూపమైనవి, నీతిపరమైనవి, వేదాంతపరమైనవి, కథారూపమైనవి, అనువాదరూపమైనవి – ఇత్యాదిగా శతకాలలో వివిధ భేదాలున్నాయి. సుమతి శతకం, వేమన శతకం వంటి నీతిబోధకాలైన శతకాలు అనన్య సామాన్యమైన వ్యాప్తి పొందాయి.

పూర్వం పాఠశాలల్లో బాలబాలికలు ఈ శతకాలలోని పద్యాలను కంఠస్థం చేసుకొనే సంప్రదాయ ముండేది. శతకాలలోని భక్తి–నీతి



ప్రబోధాలు సమాజాన్ని సన్మార్గంలో నడిపించడానికి ఉపకరిస్తాయి. అందుచేత అమూల్య నిధివంటి మన శతక సారస్వతాన్ని ఉపేక్షించడం తగదు.

కాలప్రభావాన్ని బట్టి ఇతర సంస్థలు ఈ రంగంలో శ్రద్ధ చూపకపోవచ్చు. కాని ధార్మిక సంస్థలు, ఆధ్యాత్మిక సమాజాలు, సాంస్కృతిక సంఘాలు చొరవ తీసుకొని శతకవాఙ్మయాన్ని పరిరక్షించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

ఈ సత్యం గ్రహించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారు వేలకొలదిగా ధార్మిక ఆధ్యాత్మిక గ్రంథాలను ప్రచురిస్తూ వుండడం ముదావహం.

ప్రస్తుతం 'సుభాషితరత్నాలు' అన్న పేరుతో 1) సుమతి శతకం 2) వేమన శతకం 3) భాస్కర శతకం 4) కృష్ణ శతకం 5) దాశరథి శతకం 6) శ్రీకాళహస్తీశ్వర శతకం 7) భర్తృహరి నీతిశతకం 8) కుమార శతకం మరియు 9) నరసింహ శతకం – అనే తొమ్మిది శతకాలనుండి 200 పద్యాలు సేకరించి దేవస్థానం ద్వారా ప్రచురించడమయింది. ఈ శతకాలన్నీ ఆంధ్రవాఙ్మయంలో అద్వితీయఖ్యాతి బొందినవే. లోకోత్తర ప్రతిభాసంపన్నులైన కవులు రచించినవే.

అర్థంలేని చదువు వ్యర్థమన్నారు. ఇందలి పద్యాలకు సముచిత రీతిలో తాత్పర్యం కూడా సమకూర్చి ప్రచురించడం అభినందనీయం.

ఈ పద్యాలను సంకలనం చేసి వివరణ వ్రాసినవారు దేవస్థానం ప్రచురణల విభాగంలో ఉపసంపాదకులుగా ఉన్న డా॥ నొస్సం నరసింహాచార్యులు. వీరింతకు ముందే పలుగ్రంథాలు

రచించియున్నారు. రచయితగానే కాక వక్తగా కూడా పేరొందిన వారు. ప్రచురణ విభాగంలో చాలా చురుకుగా పనిచేస్తూ అధికసంఖ్యలో గ్రంథాలు వెలువడడానికి కృషి చేస్తున్నారు. వారిని అభినందిస్తున్నాను.

ఇందలి సుభాషితాలు పిల్లలలోనూ, పెద్దలలోనూ కూడా విరివిగా వ్యాపించి వారి జీవితగమనానికి కరదీపికలు కావాలనీ, ఈ పుస్తకం పునఃపునః ముద్రణ పొందాలనీ ఆశిస్తున్నాను.

ఈ గ్రంథాన్ని ఇలా ప్రచురించడానికి సమ్మతించిన దేవస్థానం ఉన్నతాధికారి వర్గానికీ, విశేషించి ప్రచురణ విభాగ ప్రత్యేకాధికారి ఆచార్య తాళ్లూరి ఆంజనేయులు గారికీ నా నమస్సులు.

తిరుపతి
21-8-2017 **– డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

# కృతజ్ఞతాంజలి



ధర్మాచరణ పెద్దల్లో మాత్రమే కాకుండా బాలలకు కూడా అలవడాలన్న సంకల్పంతో ధర్మాన్ని, నీతిని బోధించే సుభాషితరత్నాలను ఏర్చి కూర్చి అందించాలని సంకల్పించిన తిరుమల తిరుపతి దేవస్థానములు కార్యనిర్వహణాధికారి శ్రీ అనిల్ కుమార్ సింఘాల్, ఐ.ఏ.ఎస్., సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ పోలభాస్కర్, ఐ.ఏ.ఎస్. గార్లకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. నాపై అపారమైన వాత్సల్యంతో, నమ్మకంతో ఆ బాధ్యతలను నాకు అప్పగించిన తి.తి.దే. ప్రచురణల విభాగం పూర్వ ప్రత్యేకాధికారి శ్రీ ప్రయాగ రామకృష్ణ, ప్రస్తుత ప్రత్యేకాధికారి డా॥ తాళ్లూరి ఆంజనేయులు గార్లకు నా కృతజ్ఞతాభివందనములు.

'సుభాషితరత్నాలు' ఏర్చికూర్చడంలో సహకరించిన ప్రచురణల విభాగ కార్యాలయ పండితులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, శ్రీ కట్టా నరసింహులు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ డా॥ ముదివేడు ప్రభాకరరావుగార్లకు నా హృదయపూర్వక ధన్యవాదాలు.

అన్ని విషయాల్లో నా వెన్నంటి ఉండి, నన్ను ప్రోత్సహిస్తున్న పెద్దలు మహామహోపాధ్యాయ డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారికి, తి.తి.దే. ప్రధాన సంపాదకులు డా॥ కె.రాధారమణగారికి మరియు నా సహోద్యోగులందరికీ నా కృతజ్ఞతాజంలులు సమర్పించుకుంటూ... కలియుగ ప్రత్యక్షదైవం తిరుమల శ్రీవారి చరణకమలాలవద్ద ఈ సుభాషితరత్నాలను సమర్పించుకుంటున్నాను.

సదా శ్రీవారి సేవలో

**డా॥ నొస్సం నరసింహాచార్య**

# విషయసూచిక

# సుమతీ శతకము

తెలుగు శతక వాఙ్మయంలో సుప్రసిద్ధమైన శతకం సుమతీ శతకం. సుమతి శతక కర్త బద్దెన. ఇతనికే భద్రభూపాలుడు అని కూడా పేరు. ఈయనను 13 శతాబ్దానికి చెందినవాడిగా పండితులు నిర్ణయించారు. సమకాలీన రాజకీయ పరిస్థితులను, సామాజిక అవసరాలను దృష్టిలో పెట్టుకొని బద్దెన ఈ సుమతీ శతకాన్ని రచించాడు. సుమతీ శతకం నాటి సమకాలీన ప్రజల జీవనవిధానానికి, వారి మనస్తత్వానికి అద్దం పడుతున్నట్టుగా ఉంటుంది. గ్రామీణ జీవనానికి సంబంధించిన అనేక అంశాలను రచయిత ఈ శతకంలో వర్ణించాడు.

**క. అక్కఱకు రాని చుట్టము,**
**మ్రొక్కిన వరమీని వేల్పు, మోహరమునఁదా**
**నెక్కినఁ బాఱని గుఱ్ఱము**
**గ్రక్కున విడువంగవలయుఁ గదరా సుమతీ! 1**

సుమతీ! అవసరమైనప్పుడు సహాయం చేయని బంధువును, నిత్యం పూజించినా, నమస్కరించినా వరమివ్వని దేవుణ్ణి, యుద్ధరంగంలో తాను ఎక్కగా పరుగెత్తని గుర్రాన్ని వెంటనే విడిచిపెట్టాలి.

**క. అడిగిన జీతం బియ్యని**
**మిడిమేలపు దొరను గొల్చి మిడుకుటకంటెన్**
**వడిగల యెద్దులఁ గట్టుక**
**మడి దున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ! 2**

సుమతీ! బాగా పని చేయించుకుని జీతంమాత్రం అడిగినా కూడా ఇవ్వని గర్వి అయిన ప్రభువువద్ద పని చేసి బాధలు పడడంకంటె వేగంగా

పని చేయగల ఎద్దులను కట్టుకొని పొలాలను దున్నుకుంటూ ఈ భూమిమీద బ్రతకటం మంచిది.

క. అప్పిచ్చువాఁడు, వైద్యుఁడు,
**నెప్పుడు నెడతెగక పాఱు నేఱున్, ద్విజుఁడున్**
**జొప్పడిన యూర నుండుము**
**చొప్పడకున్నట్టి యూరు జొరకుము సుమతీ!** 3

ఓ సుమతీ! అవసరమైన సందర్భంలో అప్పు ఇచ్చేవాళ్ళూ, రోగాలేవైనా వస్తే చక్కగా వైద్యంచేసి నయంచేసే వైద్యులూ, ఎప్పుడూ ఎండిపోకుండా నీటిప్రవాహంతో ఉండే నదీ, అన్ని కార్యక్రమాలను ముందుండి నడిపించే బ్రాహ్మణుడూ, ఇవన్నీ ఉండే ఊళ్ళోనే కాపురం ఉండాలి. వీటిలో ఏవి లేకపోయినా ఆ ఊరిని వదిలేయాలి.

క. **ఆఁకొన్న కూడె యమృతము**
**తాఁకొంచక నిచ్చువాఁడె దాత ధరిత్రిన్,**
**సోఁ కోర్చువాఁడె మనుజుఁడు,**
**తేఁకువగలవాఁడె వంశ తిలకుఁడు సుమతీ!** 4

ఓ సుమతీ! ఆకలిగా ఉన్నప్పుడు లభించే అన్నమే అమృతం. విసుగుపడకుండా దానగుణంతో దానం చేసేవాడే దాత. ఎటువంటి తీవ్రమైన కోపం వచ్చినా కూడా ఓర్చుకొని ప్రవర్తించేవాడే ఉత్తమమైన మానవుడు. మంచి ధైర్యం ఉన్నవాడే వంశం పేరుప్రతిష్ఠలు నిలిపే శ్రేష్ఠుడు అని పిలువబడతారు.



క. **ఇచ్చునదె విద్య, రణమునఁ**
**జొచ్చునదె మగతనంబు, సుకవీశ్వరులన్,**
**మెచ్చునదె నేర్పు, వాదుకు**
**వచ్చునదే కీడుసుమ్ము వసుధను సుమతీ!** 5

ఓ సుమతీ! ఈ లోకంలో ధనాన్ని సంపాదించేందుకు కావాల్సిన నైపుణ్యాన్ని ఇచ్చేదే విద్య. యుద్ధభూమిలో ప్రవేశించేటట్లు చేసేదే పౌరుషం, కవీశ్వరులు మెచ్చుకొనేలా చెప్పేదే కవిత్వం, అలాగే గొడవలు వచ్చేటట్లు మాట్లాడే వాక్యాలే హాని కలిగిస్తాయి సుమా!

క. **ఇమ్ముగఁ జదువని నోరును**
**అమ్మాయని! పిలిచి యన్న మడుగని నోరున్**
**దమ్ములఁ బిలువని నోరును**
**గుమ్మరి మను ద్రవ్వినట్టి గుంటర సుమతీ!** 6

ఓ సుమతీ! ఇంపుగా మంచిమాటలు పలుకలేని నోరు, అమ్మా అని పిలిచి అన్నం అడగలేని నోరు, ఆప్యాయతతో తమ్ములను తమ్ముడా! అని పిలువలేని నోరు, మన్నుకోసం కుమ్మరివాడు త్రవ్విన గోయివలె ఏమాత్రం పనికిరానివే అవుతాయి.

క. **ఉడుముండదె నూఱేండ్లును**
**బడియుండదె పేర్మిఁబాము పదినూఱేండ్లున్**
**మడువునఁ గొక్కెర యుండదె**
**కడు నిలఁ బురుషార్థపరుఁడు గావలె సుమతీ!** 7

ఓ సుమతీ! ఈ సృష్టిలోని జీవరాశుల్లో ఉడుము వంద సంవత్సరాలు జీవిస్తుంది. పాము వేయి సంవత్సరాలు జీవిస్తుంది. అలాగే కొంగ చెరువులో జీవిస్తుంది. కానీ వాటి జీవితాలకు ప్రయోజనం లేదు. కాబట్టి మనిషి జీవించినంత కాలంలోనే పురుషార్థాలైన ధర్మార్థ కామమోక్షాలను సాధించి తన జీవితాన్ని సార్థకం చేసుకోవాలి.

**క. ఉత్తమ గుణములు నీచున**
**కెత్తెఱఁగున గలుగనేర్చు నెయ్యడలం దా**
**నెత్తిచ్చి కఱగిపోసిన**
**నిత్తడి బంగారమగునె యిలలో సుమతీ! 8**

ఓ సుమతీ! బంగారానికి సమానమైన ఇత్తడిని తెచ్చి ఎన్నిసార్లు కరిగించి పోసినా ఇత్తడి ఇత్తడిగానే ఉంటుంది కానీ బంగారం కాదు. అలాగే ఒక నీచుడిని ఉత్తమునిగా మార్చాలని ఎన్నిసార్లు ఎన్ని విధాలుగా ప్రయత్నించినా వాడి ప్రవర్తనలో మార్పురాదు. ఉత్తముడు కాలేదు.

**క. ఉపకారికి నుపకారము**
**విపరీతము గాదు సేయ వివరింపంగా**
**నపకారికి నుపకారము**
**నెపమెన్నక సేయువాఁడె నేర్పరి సుమతీ! 9**

ఓ సుమతీ! మనకు సహాయం చేసినవారికి తిరిగి సహాయం చేయడం పెద్ద విషయమేమీ కాదు! మనకు కీడు చేసినవాడికి కూడా సందర్భాన్నిబట్టి వాడి తప్పులను తలుచుకోకుండా సహాయం చేసేవాడే ఈ లోకంలో నేర్పరి అవుతాడు.



**క. ఎప్పటి కెయ్యది ప్రస్తుత**
**మప్పటి కా మాటలాడి యన్యుల మనముల్**
**నొప్పింపక తా నొవ్వక**
**తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ! 10**

ఓ సుమతీ! ఏ సమయానికి ఏం మాట్లాడాలో ఆ సమయానికి అవే మాట్లాడి ఎదుటివారిని బాధపెట్టకుండా, తానూ బాధపడకుండా తప్పించుకుని తిరిగేవాడే ఈ లోకంలో ధన్యజీవి అవుతాడు.

**క. ఎప్పుడు సంపద కలిగిన**
**నప్పుడె బంధువులు వత్తు రది యెట్లన్నన్**
**దెప్పలుగఁజెఱువు నిండినఁ**
**గప్పలు పదివేలు చేరుఁ గదరా సుమతీ! 11**

ఓ సుమతీ! వర్షాలు పడి చెరువులు బాగా నిండగానే కప్పలన్నీ చుట్టూవచ్చి చేరతాయి. అలాగే మనిషికి సిరిసంపదలు ఎప్పుడు వస్తే అప్పుడు బంధువులందరూ అతని పొగుడుతూ అతనిచుట్టూ వచ్చి చేరుతారు.

**క. కనకపు సింహాసనమున**
**శునకముఁ గూర్చుండఁబెట్టి శుభలగ్నమునం**
**దొనరఁగ బట్టముగట్టిన**
**వెనుకటి గుణమేల మాను వినరా సుమతీ! 12**

సుమతీ! బంగారు సింహాసనంమీద ఒక కుక్కను ఒక శుభముహూర్తాన్ని చూసి కూర్చోబెట్టి వైభవంగా పట్టాభిషేకం చేసినంత

మాత్రాన అది తన వెనుకటి గుణాన్ని (కుక్కబుద్ధిని) ఏమైనా వదులుకుంటుందా? వదులుకోదు కదా! అలాగే పుట్టుకతో నీచమైన బుద్ధి ఉన్నవాడికి మంచి స్థితి (గొప్ప పదవి, హోదా) కలిగినా కూడా వాడు వెనుకటి సహజమైన బుద్ధిని వదులుకోడు.

**క. కమలములు నీటఁ బాసినఁ**
**గమలాప్తుని రశ్మి సోఁకి కమలిన భంగిన్**
**దమ దమ నెలవులు దప్పినఁ**
**దమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ! 13**

సుమతీ! కమలాలు తమ నివాసస్థానమైన నీటిలో ఉన్నప్పుడు మిత్రుడైన సూర్యుని కిరణాలచేత వికసిస్తాయి. అవే కమలాలు తమ నివాసమైన నీటిని వదలి బయటకు వస్తే అదే మిత్రుడైన సూర్యుని కిరణాలు సోకి వాడిపోతాయి. అలాగే తమ తమ స్థానాల్లో ఉన్నప్పుడు మిత్రులుగా ఉన్నవారు ఆ స్థానం వదలగానే శత్రువులవుతారు. ఇది నిజం. అందుకే ఎవరి స్థానాల్లో వారు ఉండాలి.

**క. కులకాంత తోడ నెప్పుడుఁ**
**గలహింపకు, వట్టి తప్పు ఘటియింపకుమీ**
**కలకంఠి కంట కన్నీ**
**రొలికిన సిరి యింటనుండ నొల్లదు సుమతీ! 14**

ఓ సుమతీ! ఇంటికి దీపం ఇల్లాలు. అటువంటి ఇల్లాలితో (భార్య) ఎప్పుడూ గొడవపడరాదు. కేవలం తప్పులే ఎత్తిచూపుతూ బాధపెట్టరాదు. ఏ ఇంట ఇల్లాలు కన్నీరు కారుస్తుందో, ఆ ఇంట్లో సిరిసంపదలు (లక్ష్మీదేవి) నిలిచి ఉండవు. అంటే సిరిసంపదలు కోల్పోయి దరిద్రులు అవుతారు.



**క. కూరిమిగల దినములలో**
**నేరము లెన్నఁడును గలుఁగ నేరవు, మఱి యా**
**కూరిమి విరసంబైనను**
**నేరములే తోఁచుచుండు నిక్కము సుమతీ! 15**

సుమతీ! వ్యక్తులమధ్య స్నేహం బాగా ఉన్న రోజుల్లో (స్నేహితులుగా ఉన్నప్పుడు) ఎన్ని తప్పులు జరిగినా అవి తప్పులుగా కనిపించవు. అదే స్నేహం చెడి విరోధులుగా మారినప్పుడు మంచి పనులు కూడా నేరాలుగానే కనిపిస్తాయి. ఇది సత్యం. ఇది మానవనైజం.

**క. చీమలు పెట్టిన పుట్టలు**
**పాముల కిరవైన యట్లు పామరుఁడు దగన్**
**హేమంబుఁ గూడఁ బెట్టిన**
**భూమీశుల పాలఁ జేరు భువిలో సుమతీ! 16**

చీమలు కష్టపడి మట్టితో పుట్టలు కట్టుకుంటాయి. క్రమంగా ఆ పుట్టలు పాములకు నివాసంగా మారుతాయి. అలాగే అజ్ఞాని అయిన వాడు బంగారాన్ని (ధనాన్ని) కూడబెడితే అది రాజుల పాలవుతుంది.

**క. తన కోపమె తన శత్రువు**
**తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌఁ**
**దన సంతోషమె స్వర్గము**
**తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ! 17**

సుమతీ! తన కోపమే తనకు శత్రువు అవుతుంది. తన శాంతమే తనను రక్షిస్తుంది. తన దయాగుణమే తనకు బంధువుగా ఉంటుంది. తన సంతోషమే తనకు స్వర్గసుఖాలను ఇస్తుంది. తన దుఃఖమే తనకు

నరక బాధలను కలిగిస్తుంది. కోపం అన్ని అనర్థాలకు మూలమైంది. ఇది నిజం.

**క. తలనుండు విషము ఫణికిని**
**వెలయంగాఁ దోకనుండు వృశ్చికమునకున్**
**దలతోఁక యనక యుండును**
**ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ! 18**

సుమతీ! పాముకు కోరల్లో మాత్రమే విషం ఉంటుంది. తేలుకు తోకకొండిలో మాత్రమే విషం ఉంటుంది. కానీ దుర్మార్గులకు తల, తోక అని ఒకచోట కాకుండా నిలువెల్లా (శరీరమంతా) విషం వ్యాపించి ఉంటుంది కదా!

**క. ధనపతి సఖుఁడై యుండియు**
**నెనయంగా శివుఁడు భిక్ష మెత్తఁగవలసెన్**
**దనవారి కెంతకలిఁగిన**
**దనకలిమియె తనఁకుగాక తథ్యము సుమతీ! 19**

ధనానికి అధిపతి అయిన కుబేరుడిని స్నేహితునిగా కలిగి ఉన్న శివుడుకూడా భిక్షం ఎత్తవలసి వచ్చింది. అలాగే తనవారికి ఎంత ధనం ఉన్నా, తనకు వచ్చేదేమీలేదు. తనకు రావలసింది మాత్రమే తనకు వస్తుంది. అంటే ఇతరుల ధనం ఎప్పటికీ తనది కాదు. అది ఇతరులదే అవుతుంది. తనకెంత దక్కాలో అంతే దక్కుతుంది.

**క. నవ్వకుమీ సభలోపల**
**నవ్వకుమీ తల్లిఁదండ్రి నాథులతోడన్**
**నవ్వకుమీ పరసతితో**
**నవ్వకుమీ విప్రవరుల నయమిది సుమతీ! 20**



సుమతీ! పెద్దలందరు ఉన్న సభలో నవ్వకూడదు. తల్లితో, తండ్రితో, ప్రభువుతో (అధికారి) హాస్యప్రసంగం చేయరాదు. పరస్త్రీలతో నవ్వులాట పనికిరాదు. బ్రాహ్మణులను చూచి నవ్వకూడదు. ఇది నీకే మేలు చేస్తుంది. అంటే అసందర్భంగా, అనవసరంగా ఎవ్వరినీ చూచి నవ్వరాదు. నవ్వు నాలుగువిధాలుగా చేటు తెచ్చిపెడుతుంది.

**క. నీరే ప్రాణాధారము**
**నోరే రసభరితమైన నుడువుల కెల్లన్**
**నారియె నరులకు రత్నము**
**చీరయె శృంగారమండ్రు స్త్రీలకు సుమతీ! 21**

సుమతీ! ప్రాణులన్నిటికీ నీరే జీవనాధారం. నోరే నవరసాలతో కూడిన మాటలకు ఆధారం. మానవులకు స్త్రీయే రత్నంవంటిది. చీరకట్టులోని సొగసే స్త్రీల అందాన్ని ఇనుమడింపజేస్తాయి.

**క. పుత్రోత్సాహము తండ్రికి**
**పుత్రుఁడు జన్మించినపుడె పుట్టదు, జనులా**
**పుత్రుని గనుఁగొని పొగడఁగ,**
**పుత్రోత్సాహంబు నాఁడు పొందుర సుమతీ! 22**

సుమతీ! కొడుకు పుట్టగానే తండ్రికి ఆనందం కలుగదు. జనులందరూ ఆ పుత్రుని చూచి పొగుడుతున్నప్పుడు పుత్రుడు పుట్టినదానికి ఆ రోజు నిజమైన ఆనందం తండ్రికి కలుగుతుంది.

**క. బలవంతుఁడ నాకేమని**
**పలువురితో నిగ్రహించి పలుకుట మేలా**
**బలవంతమైన సర్పము**
**చలిచీమలచేతఁ జిక్కి చావదె సుమతీ! 23**

సుమతీ! నేను బలవంతుడిని. నన్ను ఎవ్వరూ ఏమీ చేయలేరు అని గర్వంతో విర్రవీగుతూ అందరితో విరోధం తెచ్చుకోరాదు. బలవంతమైన పాము కూడా బలహీనమైన చలిచీమల చేతికి చిక్కి చావడం లేదా!

**క. మాటకుఁ బ్రాణము సత్యము**
**కోటకుఁ బ్రాణంబు సుభట కోటి, ధరిత్రిన్**
**బోటికిఁ బ్రాణము మానము**
**చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ! 24**

సుమతీ! ఈ భూమిపై నోటిమాటకు సత్యమే ప్రాణం. గొప్ప సేనాసమూహమే కోటకు ప్రాణం. స్త్రీలకు అభిమానమే ప్రాణం. వ్రాతపత్రాలకు చేతి సంతకమే ప్రాణం. ఇది నిజం.

**క. లావుగలవాని కంటెను**
**భావింపఁగ నీతిపరుఁడు బలవంతుండౌ**
**గ్రావంబంత గజంబును**
**మావటివాఁడెక్కినట్లు మహిలో సుమతీ! 25**

సుమతీ! ఈ లోకంలో శారీరక బలం ఉన్నవానికన్నా, బుద్ధిబలం ఉండేవాడు (నీతిగా ఉండేవాడు) బలవంతుడుగా భావించబడుతాడు. అదెలాగంటే బుద్ధిబలం ఉన్న చిన్న మావటివాడు పర్వతమంత ఎత్తైన ఏనుగును తను చెప్పినట్లుగా నడిపిస్తాడు కదా! భుజబలంకన్నా బుద్ధిబలం గొప్పది.



**క. వినఁదగు నెవ్వరు చెప్పిన**
**వినినంతనె వేగపడక వివరింపఁదగున్**
**కని కల్ల నిజముఁ దెలిసిన**
**మనుజుఁడే పో నీతిపరుఁడు మహిలో సుమతీ! 26**

సుమతీ! ఈ భూమిపై ఎవరేమీ చెప్పినా ముందు వినడం నేర్చుకోవాలి. విన్నవెంటనే తొందరపడి నిర్ణయం తీసుకోకుండా బాగా ఆలోచించాలి. అలా బాగా ఆలోచించడంవల్ల నిజానిజాలు బయట పడతాయి. అలా తెలుసుకోగలిగినవాడే నీతిమంతుడనబడతాడు.

**క. శ్రీరాముని దయచేతను**
**నారూఢిగ సకల జనులు, నౌరాయనఁగా**
**ధారాళమైన నీతులు**
**నోరూరఁగఁ జవులువుట్ట, నుడివెద సుమతీ! 27**

మంచి బుద్ధికలదానా!/వాడా! శ్రీరామచంద్రుని దయతో లోకంలోని ప్రజలందరూ ఆశ్చర్యంతో మెచ్చుకొనేటట్లుగా ఇష్టమైన పదార్థాలు చూసినప్పుడు తినాలనే కోరికతో నోట నీరు ఊరినట్లుగా ఇంకా ఇంకా వినాలనే కుతూహలం కలిగిస్తూ ధారాళంగా నీతివాక్యాలను అందంగా చెబుతాను.

**క. సరసము విరసము కొఱకే**
**పరిపూర్ణసుఖంబు లధికబాధల కొఱకే**
**పెరుగుట విఱుగుట కొఱకే**
**ధర హెచ్చుట తగ్గ కొఱకే తథ్యము సుమతీ! 28**

సుమతీ! నవ్వులాటలు {నవ్వుతూ (హేళనగా) మాట్లాడేమాటలు} విరోధాన్ని గొడవలు తెచ్చిపెడతాయి. మితిమీరిన సుఖాలు విపరీతమైన బాధలను తెచ్చిపెడ్తాయి. పెరగడం తరిగిపోవడం కొరకే. ఒక వస్తువు ధర పెరగడం తగ్గిపోవడం కొరకే అవుతుంది. ఇది నిజం.

**క. సిరి దా వచ్చిన వచ్చును**
**సరసంబుగ నారికేళ సలిలము భంగిన్**
**సిరి దాఁ బోయిన బోవును**
**కరిమ్రింగిన వెలగపండు కరణిని సుమతీ! 29**

సుమతీ! కొబ్బరికాయలోకి నీరులాగా సంపదలు ఎలా వచ్చాయో తెలియకుండానే వస్తాయి. అవే సంపదలు ఏనుగు తిన్న వెలగపండులోని గుజ్జులాగా మాయమైపోతాయి. అంటే సంపదలు కొబ్బరికాయలోకి నీరు వచ్చినట్లు ... తెలియకుండానే వస్తాయి. అలాగే వెలగపండును ఏనుగు తినగా లోపలి గుజ్జును మాయంచేసి పై డొప్పను విసర్జించినట్లు, సంపదలు మాయమైపోతాయి. సంపదలు శాశ్వతాలు కావని భావం.

**క. స్త్రీలయెడ వాదులాడకు**
**బాలురతోఁ జెలిమిచేసి భాషింపకుమీ**
**మేలైన గుణము విడువకు**
**ఏలిన పతి నిందసేయ కెన్నడు సుమతీ! 30**

సుమతీ! స్త్రీలతో ఎప్పుడూ వాదులాడరాదు. పిల్లలతో స్నేహంచేసి మాట్లాడరాదు. మంచిగుణాలను వదలరాదు. పోషించే యజమానిని నిందించరాదు. ఇలాంటివి చేస్తే కష్టాలు కొనితెచ్చుకున్నవారౌతారు.

* * *



## వేమన శతకము

**వానకు తడవనివాడు, వేమన పద్యాన్ని చదవనివాడు ఈ తెలుగు దేశంలో ఎవరూ ఉండరని చెప్పడం అతిశయోక్తి కాదు. వేమన ప్రజాకవి. సమాజంలోని కుళ్లును, కుతంత్రాలను దృష్టాంతపూర్వకంగా, సులభమైన భాషలో సామాన్య ప్రజానీకానికి అర్థమయ్యే రీతిలో చెప్పిన కవి వేమన. వేమన 1540–1600 ప్రాంతానికి చెందిన వాడని పండితుల అభిప్రాయం. వేమన కవిత్వం స్వచ్ఛమైన చెలమ శైలి, భావనలో స్వతంత్రమైనది. మకుటం మినహాయించి మూడు పాదాలలోనే చెప్పదలచుకున్న భావాన్ని సూటిగా, స్పష్టంగా చెప్పడం వేమన ప్రత్యేకత.**

**ఆ. నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు**
**తళుకుబెళుకు రాళ్ళు తట్టెడేల**
**చదువ పద్యమరయ చాలదా ఒక్కటి**
**విశ్వదాభిరామ వినురవేమ! 1**

అసలుసిసలైన ఇంద్రనీలమణి ఒక్కటున్నా చాలు. తళతళమెరిసే రంగురాళ్ళు తట్టెడు ఉన్నా ప్రయోజనం లేదు. అలాగే రసాస్వాదన కలిగించే సారవంతమైన పద్యం ఒక్కటున్నా చాలు. నిస్సారమైన పద్యాలు ఎన్నివున్నా వ్యర్థమే కదా!

**ఆ. గంగిగోవు పాలు గంటెడైనను చాలు!**
**కడివెడైన నేమి ఖరముపాలు?**
**భక్తిగల్గు కూడు పట్టెడైనను జాలు**
**విశ్వదాభిరామ వినురవేమ! 2**

వేమా! ఆవుపాలు చాలా శ్రేష్ఠమైనవి. అటువంటి శ్రేష్ఠమైన ఆవుపాలు ఒక గరిటెడు ఉన్నా చాలు. కానీ ప్రయోజనం లేనటువంటి గాడిదపాలు ఒక కడవనిండా ఉన్నా వ్యర్థమే. అలాగే ఆప్యాయతతో పెట్టే భోజనం పట్టెడైనా చాలు. నిందిస్తూ పెట్టే భోజనం కడుపునిండుగా పెట్టినా అది శరీరానికి అంటదు.

**ఆ. చిత్తశుద్ధిగల్గి చేసిన పుణ్యంబు**
**కొంచెమయిన నదియుఁ గొదువ గాదు**
**విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత**
**విశ్వదాభిరామ వినురవేమ! 3**

ఓ వేమా! శ్రద్ధగా మంచి మనస్సుతో చేసే పనులవల్ల కలిగే పుణ్యం కొంచెమైనా కూడా అది చాలా విలువైనది, సాటిలేనిది. అది ఎలాగంటే మర్రివిత్తనం చూసేందుకు చాలా చిన్నదే కానీ, ఆ విత్తనం నుండి పెరిగే మొక్క విశాలమైన మర్రిచెట్టుగా మారుతుంది కదా!

**ఆ. ఆత్మశుద్ధిలేని ఆచార మది యేల?**
**భాండశుద్ధిలేని పాకమేల?**
**చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా?**
**విశ్వదాభిరామ వినురవేమ! 4**

ఓ వేమా! మనసు పరిశుద్ధంగా లేకుండా ఎన్ని ఆచారాలను నిర్వర్తించినా అది వ్యర్థమే. శుభ్రంగా లేని పాత్రలో వండిన వంట ఎవ్వరికీ ఉపయోగపడదు. అలాగే మనస్సు శుద్ధంగా ప్రశాంతంగా లేకుండా భగవంతుణ్ణి ఎంత పూజించినా అది వ్యర్థమే అవుతుంది.



**ఆ. అల్పుఁడెపుడుఁ బల్కు నాడంబరముగాను**
**సజ్జనుండు పల్కుఁ జల్లగాను**
**కంచుమ్రోగునట్లుఁ కనకంబు మ్రోగునా!**
**విశ్వదాభిరామ వినురవేమ! 5**

ఓ వేమా! నీచుడు ఎప్పుడు తన గొప్పలు చెప్పుకుంటూ ఉంటాడు. మంచివాడు చల్లగా మాట్లాడుతుంటాడు. కంచు మ్రోగుతుంది కాని బంగారు మ్రోగదు. అల్పుడు కంచువంటివాడు. సజ్జనుడు బంగారం లాంటివాడు.

**ఆ. మేడిపండు చూడఁ మేలిమై యుండును**
**పొట్ట విప్పి చూఁడ బురుగులుండుఁ**
**బిఱికివాని మదిని బింక మీలాగురా!**
**విశ్వదాభిరామ వినురవేమ! 6**

ఓ వేమా! మేడిపండు చూడడానికి నిగనిగలాడుతూ కనిపిస్తుంది. దాన్ని పొట్ట చీల్చి చూస్తే లోపల పురుగులుంటాయి. పిరికివాడు కూడా గొప్పలు చెబుతాడు. కానీ లోపల మాత్రం భయపడుతూనే ఉంటాడు.

**ఆ. పూజకన్న నెంచ బుద్ధి నిధానంబు**
**మాటకన్న నెంచ మనసు దృఢము**
**కులముకన్న నెంచ గుణము ప్రధానంబు**
**విశ్వదాభిరామ వినురవేమ! 7**

ఓ వేమా! ఒక వ్యక్తి ఎంత పూజ చేస్తున్నాడు అనేది ముఖ్యం కాదు. ఎటువంటి బుద్ధితో చేస్తున్నాడు అన్నది ముఖ్యం. ఏ కులానికి

చెందినవాడు అన్నది ముఖ్యంకాదు. ఎటువంటి గుణాన్ని కలిగి ఉన్నాడు అన్నదే ముఖ్యం.

**ఆ. వేఱుపురుఁగు చేరి వృక్షంబుఁ జెఱచును**
**చీడపురుఁగు చేరి చెట్టు జెఱచుఁ**
**కుత్సితుండు చేరి గుణవంతుఁ జెఱచురా**
**విశ్వదాభిరామ వినురవేమ! 8**

వేమా! ఒక చెట్టు వేరుకు పురుగుపడితే ఆ వృక్షం పాడైపోతుంది. ఒక చెట్టుకు చీడపడితే చెట్టు ఎండిపోతుంది. గుణవంతునితో దుర్మార్గుడు చేరి వాణ్ణి చెడగొడతాడు. అంటే గుణవంతుడు కూడా వాడి మంచిస్వభావాన్ని కోల్పోయి దుర్మార్గుడవుతాడు.

**ఆ. అల్పబుద్ధి వాని కధికార మిచ్చిన**
**దొడ్డవారి నెల్ల దొలఁగగొట్టు**
**జెప్పు దినెడి కుక్క చెఱకు తీపెఱుగునా**
**విశ్వదాభిరామ వినురవేమ! 9**

వేమా! హీనమైన బుద్ధి ఉన్నవానికి అధికారం ఇస్తే, పెద్దవారిని (సజ్జనులను) అవమానించి వెళ్ళగొడ్తాడు. అదెలాగంటే చెప్పులు తినే బుద్ధి ఉన్న కుక్క తియ్యని చెరకుగడను తింటుందా? దానికి చెప్పు రుచి తప్ప చెరకుతీపి తెలియదు కదా! అలాగే నీచగుణం ఉన్నవానికి అధికారం కట్టపెట్టినా వాడికి మంచిగుణం రాదు.



**ఆ. ఎలుగుతోలుఁదెచ్చి ఏడాది యుతికిన**
**నలుపు నలుపెగాని తెలుపురాదు**
**కొయ్యబొమ్మ దెచ్చి కొట్టినఁబలుకునా!**
**విశ్వదాభిరామ వినురవేమ! 10**

వేమా! ఎలుగుబంటితోలు తీసుకువచ్చి సంవత్సరంపాటు ఉతికినా అది తన నలుపురంగును పోగొట్టుకొని తెల్లగా మారదు. అలాగే కొయ్యబొమ్మను కొట్టినా, తిట్టినా బదులిస్తుందా! దుర్మార్గుణ్ణి ఎంత మార్చాలని ప్రయత్నించినా ఆ ప్రయత్నం వ్యర్థమే అవుతుంది.

**ఆ. అన్ని దానములను అన్నదానమె గొప్ప**
**కన్న తల్లి కంటె ఘనత లేదు**
**ఎన్న గురునికన్న నెక్కుడు లేదయా**
**విశ్వదాభిరామ వినురవేమ! 11**

వేమా! ఈ లోకంలో అన్నదానాన్ని మించిన దానమే లేదు. జన్మనిచ్చిన తల్లినిమించిన వారు మరొకరు లేరు. అలాగే విద్యనేర్పిన గురువుకన్నా గౌరవనీయులు మరొకరు వెతికినా ఉండరు.

**ఆ. నీళ్ళలోని చేప నెఱిమాంస మాశించి**
**గాలమందు జిక్కు కరణి భువిని**
**ఆశ దగిలి నరుడు నాలాగె చెడిపోవు**
**విశ్వదాభిరామ వినురవేమ! 12**

వేమా! చేపలు పట్టేవాడు వేసిన గాలానికి ఉండే ఆహారాన్ని తిందామని ఆశపడి నీళ్ళలో ఉండే చేప గాలానికి చిక్కుకుంటుంది.

అలాగే ఈ లోకంలో మనిషికూడా 'ఆశ' అనే గాలానికి తగులుకొని చెడిపోతున్నాడు. అంటే మనిషికి ఆశ ఉండవచ్చు కానీ, అత్యాశ, దురాశ ఉండరాదు.

**ఆ. పట్టు పట్టరాదు పట్టి విడువరాదు**
**పట్టెనేని బిగియఁ బట్టవలయుఁ**
**పట్టి విడుటకన్నఁ బడి జచ్చుటే మేలు**
**విశ్వదాభిరామ వినురవేమ! 13**

వేమా! ఏదైనా ఒక కార్యాన్ని సాధించాలంటే పట్టుదల చూపరాదు. అలా పట్టుదల పడితే ఆ కార్యాన్ని సాధించేవరకు విడిచిపెట్టరాదు. పట్టుదల పట్టి విడిచిపెట్టడం కన్నా చావడమే మేలు. అంటే కార్యసాధకునికి పట్టుదల ప్రాణంతో సమానమైంది.

**ఆ. అనఁగ ననఁగ రాగ మతిశయిల్లుచునుండు**
**దినఁగ దినఁగ వేము తియ్యనుండు**
**సాధనమునఁ బనులు సమకూరు ధరలోన**
**విశ్వదాభిరామ వినురవేమ! 14**

వేమా! ఈ లోకంలో పాడగా పాడగా రాగం బాగా కుదురుతుంది. తింటూ తింటూ ఉంటే వేపాకు కూడా తియ్యగా రుచిస్తుంది. అలాగే సాధన చేస్తూ చేస్తూ ఉంటే అనుకున్న కార్యాన్ని సాధించవచ్చును. అంటే కార్యసాధకునికి నిరంతర శ్రమ అవసరం.

**ఆ. తప్పులెన్నువారు తండోపతండంబు**
**లుర్వి జనులకెల్ల నుండుఁ దప్పు**
**తప్పులెన్నువారు తమ తప్పులెఱుగరు**
**విశ్వదాభిరామ వినురవేమ! 15**



వేమా! ఈ భూమిపై తప్పులు పట్టేవారు లెక్కలేనంతమంది ఉన్నారు. భూమిపై జీవించే ప్రతివాడు తప్పు చేయక మానడు. కానీ ఎదుటివారి తప్పులను లెక్కపెట్టేవాడు తాను చేసిన తప్పులను లెక్కపెట్టుకోడు. ఇది మానవనైజం.

**ఆ. ఇనుము విఱిగెనేని యినుమాఱు ముమ్మాఱు**
**కాచి యతుకవచ్చుఁ గ్రమముగాను**
**మనసు విఱిగెనేని మరియంట నేర్చునా**
**విశ్వదాభిరామ వినురవేమ! 16**

ఓ వేమా! ఇనుప వస్తువులు విరిగిపోతే దానిని నిప్పులపై కాల్చి ఎన్నిసార్లైనా అతికించవచ్చు. లేదా దాన్ని కరిగించి ఒక రూపాన్ని ఇవ్వవచ్చు. కానీ, ఆత్మీయులు అనుకున్నవారే ద్రోహం చేస్తే మనసు విరిగిపోతుంది. అలాంటప్పుడు విరిగిన మనసును మాత్రం ఒకటిగా సరిచేయడం ఎవ్వరికీ సాధ్యంకాదు.

**ఆ. చంపఁదగినయట్టి శత్రువు తనచేతఁ**
**జిక్కెనేని కీడు సేయరాదు**
**పొసఁగ మేలు చేసి పొమ్మనుటే చావు**
**విశ్వదాభిరామ వినురవేమ! 17**

ఓ వేమా! చంపదగినంత గొప్ప అపకారం చేసిన మహాశత్రువు తన చేతికి దొరికితే వానిని చంపరాదు. సరికదా, వాడి ప్రాణానికి ఎలాంటి హానీ కల్గించకుండా కావలసిన ఉపకారం చేసి వదిలేస్తే అంతకుమించిన చావు వాడికి మరొకటి లేదు.

**ఆ. అనువుగాని చోట నధికుల మనరాదు**
**కొంచెమైన నదియు గొదువగాదు**
**కొండ యద్దమందు గొంచెమై యుండదా**
**విశ్వదాభిరామ వినురవేమ! 18**

వేమా! మనకు అనుకూలం కానిచోట మనం గొప్పలు ప్రదర్శించరాదు. మనం కొంచెం తగ్గి ఉంటే మనకేమాత్రం లోటులేదు. అంతపెద్ద కొండకూడా అద్దంలో చూస్తే చిన్నదిగానే కనిపిస్తుంది. అంతమాత్రాన అది చిన్నదైపోదు కదా!

**ఆ. ధనము కూడఁబెట్టి దానంబు చేయక**
**తాను దినక లెస్స దాఁచుగాక**
**తేనెటీఁగ గూర్చి తెఋవరి కియ్యదా**
**విశ్వదాభిరామ వినురవేమ! 19**

వేమా! పిసినిగొట్టువాడు ధనాన్ని సంపాదించి దాచిపెడతాడు. కానీ ఆ ధనాన్ని ఒకరికి సహాయం చేయడు, తాను అనుభవించడు. అలాంటి పాపి సొమ్ము పరులపాలైపోతుంది. అదెలాగంటే తేనెటీగ తేనెను పోగుచేసి పెడుతుంది. తాను అనుభవించదు. అలాంటి తేనె దారినిపోయేవాడు తీసుకుపోతాడు. పాపి సొమ్ము పరులపాలు అనడం ఇలాంటిదే!

**ఆ. పశుల వన్నె వేరు పాలేక వర్ణమౌ**
**బుష్ప జాతి వేరు పూజ యొకటి**
**దర్శనంబు వేరు దైవంబు ఒకటిరా**
**విశ్వదాభిరామ వినురవేమ! 20**



వేమా! పాలిచ్చే పశువులు వివిధ రంగుల్లో ఉంటాయి. కానీ అవి ఇచ్చే పాలుమాత్రం తెలుపురంగులోనే ఉంటాయి. పూలలో వివిధరకాల జాతులు వివిధ రంగుల్లో ఉంటాయి. అయినా వాటితో చేసే పూజ మాత్రం ఒక్కటే. అలాగే చూసేకళ్ళు, పూజించే మార్గాలు వేరు వేరు కావచ్చుకానీ భగవంతుడు మాత్రం ఒక్కడే!

**ఆ. చెప్పులోనిరాయి, చెవిలోని జోరీగ,**
**కంటిలోని నలుసు, కాలిముల్లు**
**ఇంటిలోనిపోరు, ఇంతింత గాదయా**
**విశ్వదాభిరామ వినురవేమ! 21**

ఓ వేమా! కాలికింద చెప్పులో ఇరుక్కున్న రాయి, జోరీగ చెవిదగ్గర జుయ్యిమంటూ చేసే శబ్దం, కంట్లో పడ్డ నలుసు, కాలిలో గుచ్చుకున్న ముల్లు, ఇంట్లో భార్యతో గొడవలు ఇంత అని చెప్పలేం. ఆ బాధలు అనుభవించినవారికే తెలుస్తాయి.

**ఆ. లక్ష్మి యేలినట్టి లంకాధిపతిపురి**
**పిల్ల కోతి పొఁజు కొల్లపెట్టెఁ**
**జేటు కాలమయినఁ జెఋప నల్పులె జాలు**
**విశ్వదాభిరామ వినురవేమ! 22**

వేమా! రావణాసురుని రాజ్యమైన లంకానగరం ఒకప్పుడు బంగారంతో సిరిసంపదలతో వైభవంగా ఉండేది. అటువంటి లంకానగరం ఒక వానరుని ధాటికి వైభవాన్ని కోల్పోయి కాలిబూడిదైపోయింది. ఎంతటి బలవంతులకైనా చేటుకాలం వస్తే బలవంతులే కాదు బలహీనుల చేతుల్లోనైనా సరే నాశనంకాక తప్పదు.

ఆ. చిక్కియున్నవేళ సింహంబునైనను
బక్కకుక్క కఱచి బాధ పెట్టు
బలిమి లేని వేళc బంతంబు చెల్లదు
విశ్వదాభిరామ వినురవేమ! 23

వేమా! బలశాలి అయిన సింహమైనా తన బలాన్ని కోల్పోతే, బక్కచిక్కిన కుక్కకూడా దానిని కరిచి బాధపెడుతుంది. బలహీనమైన సందర్భాలలో పంతానికి పోకూడదు. అంటే కాలం అనుకూలంగా లేనప్పుడు ఎంతటి బలవంతుడైనా బలహీనులకు లొంగిపోక తప్పదు.

ఆ. పరుల దిట్టినంత పాపకర్మంబబ్బు
విడువదెన్నటికిని విశ్వమందు
పరుడు పరుడుగాడు పరమాత్మయౌనయా
విశ్వదాభిరామ వినురవేమ! 24

వేమా! ఈ లోకంలో పరులను తిట్టకూడదు. తిడితే పాపం పట్టి పీడిస్తుంది. ఆ పాపం ఎన్నటికీ విడిచిపోదు. పరులు కేవలం పరులే కాదు. ప్రతి జీవిలోనూ పరమాత్ముడుంటాడని గ్రహించాలి.

* * *



# భాస్కర శతకము

తెలుగులో సుమతి, వేమన శతకాల తర్వాత అంతటి ప్రసిద్ధి పొందింది భాస్కరశతకము. ఈ శతకాన్ని వ్రాసినవారు మారన వెంకయ్య. ఈయన **1550 - 1600** కాలానికి చెందినవాడని పండితాభిప్రాయం. భాస్కర శతకపద్యాలు సార్వకాలికమైన సత్యాలు. ఈ కవి రామాయణ భారతాలనుండేకాక వివిధ పురాణాలనుండి దృష్టాంతాలను తీసుకుని చెప్పదలచుకున్న నీతుల్ని సరళసుబోధకంగా చెప్పాడు. ఈయన శతకంలో ప్రధానంగా సజ్జన లక్షణం, దుర్జన లక్షణం, అదృష్టం, సిరిసంపదలు, మానవుల మనస్తత్వాలు మొదలైన విషయాలు కనిపిస్తాయి.

చ. అతిగుణహీనలోభికిc బదార్థము గల్గిన లేక యుండినన్
మితముగcగాని కల్మిగల మీcదటనైన భుజింప డింపుగా
సతమని నమ్ము దేహమును సంపద, నేఱులు నిండి పాఱినన్
గతుకగcజూచుc గుక్క తన కట్టడ మీఱక యెందు భాస్కరా! 1

ఓ భాస్కరా! గుణహీనుడైన పిసినారి ఈ శరీరం సిరిసంపదలు శాశ్వతాలని నమ్మి అవి ఉన్నప్పుడు కానీ లేనపుడు కానీ కొద్ది కొద్దిగానే తింటాడు. పిసినారితనం వాడికి పోదు. అదెలాగంటే నీటితో నిండుగా నది ప్రవహిస్తున్నా కూడా కుక్క కొద్ది కొద్దిగానే గతుకుతుంది.

ఉ. ఆదర మింతలేక నరుc డాత్మబలోన్నతి మంచివారికిన్
భేదము చేయుటం దనదు పేర్మికిc గీడగు మూలమె; ట్ల మ
ర్యాద హిరణ్యపూర్వకశి పన్ దనుజుండు గుణాఢ్యుడైన ప్ర
హ్లాదున కెగ్గు జేసి ప్రళయంబును బొందcడె మున్ను భాస్కరా!2

భాస్కరా! మానవుడు తనకున్న బలాన్నే సర్వస్వంగా భావించి ఎదుటివారిపట్ల ప్రేమానురాగాలు మరచి బాధలుపెడితే అది వారికే చేటు చేస్తుంది. అదెలాగంటే పూర్వ హిరణ్యకశిపుడు తన బలాన్ని నమ్ముకుని మంచివాడైన ప్రహ్లాదుని కన్న కొడుకని కూడా చూడకుండా కఠినంగా శిక్షించి బాధలుపెట్టాడు. అందుకు ప్రతిఫలంగానే హిరణ్యకశిపుడు ఘోరమైన మరణాన్ని పొందాడు.

**చ. ఉరుగుణవంతుఁడొడ్లుతన కొండపకారము సేయునప్పుడుం**
**బరహితమే యొనర్చు నొక పట్టుననైనను గీడుఁ జేయగా**
**నెఱుఁగడు; నిక్క మేకద య దెట్లనఁ? గవ్వముబట్టి యెంతయున్**
**దరువగ జొచ్చినం బెరుగు తాలిమి నీయదె వెన్న భాస్కరా! 3**

భాస్కరా! గుణవంతుడైనవాడు తనకు ఎవరైనా అపకారం చేస్తే తాను ఓర్చుకుంటాడే కానీ ఎటువంటి హాని చెయ్యడు, సరికదా వారికి సహాయం చేస్తాడు. అదెలాగంటే కవ్వం పట్టుకొని పెరుగును ఎంతగా చిలికినా పెరుగు వెన్నను అందిస్తుంది.

**చ. ఉరుబలశాలినంచుఁ దను నొల్లని యన్యపతివ్రతాంగనా**
**సురతము గోరెనేని కడ సుమ్మది భూతికిఁ బ్రాణహానియౌ;**
**శిరములు గూల రాఘవునిచే దశకంఠుఁడు ద్రుంగిపోవఁడే**
**యెఱుఁగక సీత కాసపడి యిష్టుల భృత్యులఁగూడి భాస్కరా! 4**

భాస్కరా! గొప్ప బలశాలిని అన్న గర్వంతో తనను ఇష్టపడని పతివ్రతను (స్త్రీని) బలవంతంగా పొందాలనుకుంటే అదే వాడి సంపదలకు, ప్రాణానికి హాని తెచ్చిపెడుతుంది. సర్వనాశనం చేస్తుంది. అదెలాగంటే ఇష్టంలేని సీతాదేవిని గర్వంతో అపహరించుకుపోయిన



రావణుడు శ్రీరాముని చేతిలో బంధుమిత్ర సేనలతో ప్రాణాలను కోల్పోయాడు కదా!

**ఉ. ఊరక సజ్జనుండొదిగి యుండిన నైన దురాత్మకుండు ని**
**ష్కారణ మోర్వలేక యపకారము చేయుట వాని విద్యగా;**
**చీరెలు నూరుటంకములు చేసెడి వైనను బెట్టె నుండఁగాఁ**
**జేరి చినింగిపోఁ గొఱుకు చిమ్మట కేమి ఫలంబు భాస్కరా! 5**

భాస్కరా! మంచివారు ఎవ్వరిజోలికీ పోరు. తమంత తాము ఒదిగి ఉంటారు. అయినా దుర్మార్గుడు దాన్ని సహించకుండా వారికి కీడు చేయడమే తన విద్యగా భావిస్తాడు. అదెలాగనగా చాలా విలువైన చీరలను పెట్టెలోపెట్టి భద్రంగా దాచినాకూడా చిమ్మట పురుగు ఆ చీరలను చేరి చినిగేవరకు కొరుకుతూనే ఉంటుంది. ఆ చిమ్మటకేం లాభం. అలాగే దుర్మార్గుడు సజ్జనుణ్ణి కారణం లేకుండా బాధిస్తాడు.

**చ. ఎడపక దుర్జనుం డొరుల కెంతయుఁ గీడొనరించుఁ గాని యే**
**యెడలను మేలు సేయఁ డొక యించుకయైనను; జీడపుర్వు దా**
**జెడఁదిను నింతెకాక పుడిసెండు జలంబిడి పెంప నేర్చునే**
**పొడవగుచున్న పుష్పఫలభూరుహ మొక్కటినైన భాస్కరా! 6**

భాస్కరా! దుర్మార్గుడు ఎప్పుడైనా సరే ఎదుటివారికి కీడునే తలపెడతాడు కానీ మంచిమాత్రం అస్సలు చేయడు. అదెలాగంటే చక్కగా పెరిగి పూలు, పండ్లతో అందంగా కనిపించే చెట్టును చీడపురుగుచేరి నాశనం చేస్తుందే కానీ, కాసిని నీళ్ళు పోసి ఆ చెట్టు పెరుగుదలకు సహకరించదు కదా! అలాగే దుర్మార్గుడు ఎదుటివారికి ఎప్పుడూ కీడునే చేస్తాడు.

ఉ. ఒక్కఁడెచాలు నిశ్చల బలోన్నతుఁ డెంతటి కార్యమైనఁ దాఁ
జక్కనొనర్ప గౌరవు లసంఖ్యులు పట్టిన ధేనుకోటులం
జిక్కఁగనీక తత్ప్రబలసేన ననేకశిలీముఖంబులన్
మొక్కపడంగఁజేసి తుదముట్టఁడె యొక్క కిరీటి భాస్కరా! 7

భాస్కరా! ఎంతటి కార్యమైనా సాధించడానికి సమర్థుడైన బలవంతుడు ఒక్కడు చాలు. అదెలాగంటే పూర్వం గోగ్రహణ సమయంలో అనేకులు కౌరవులు సైన్యంతో కలిసివచ్చి గోవులను అపహరించగా ఒక్క అర్జునుడే వారందరినీ ఓడించి గోవులను విడిపించాడు కదా!

చ. ఘనుఁడొక వేళఁగీడ్పడిన గ్రమ్మఱ నాతని లేమి బాపఁగా
గనుగొన నొక్క సత్ప్రభువు గాక, నరాధము లోపరెందఱుం;
బెనుఁజెఱువెండినట్టి తఱిఁ బెల్లున మేఘుఁడుగాక నీటితోఁ
దనుప దుషారముల్ శతశతంబులు చాలునటయ్య భాస్కరా! 8

భాస్కరా! సంపన్నుడైన వాడు ఎప్పుడైనా కష్టాలపాలైతే ఆ కష్టాలను తొలగించడానికి ఒక గొప్ప సంపన్నుడే రావాలి తప్ప సామాన్యులకు సాధ్యంకాదు. అదెలాగనగా ఒక పెద్దచెరువు ఎండిపోతే ఆ చెరువును నింపేందుకు పెద్ద వర్షం రావాలేకానీ మంచుబిందువులు ఎన్నివేలు కురిసినా నిండదు. అలాగే ధనవంతుని కష్టాలను తీర్చేందుకు మరో ధనవంతుడే అవసరమౌతాడు కానీ సామాన్యుడు కాదు.

చ. చదువది యెంతగల్గిన రసజ్ఞత యించుక చాలకున్న నా
చదువు నిరర్థకంబు గుణ సంయుతు లెవ్వరు మెచ్చ; రెచ్చటం
బదునుగ మంచికూర నలపాకము చేసిననైన నందు నిం
పొందవెడు నుప్పు లేక రుచి పుట్టఁగ నేర్చునటయ్య భాస్కరా! 9



విద్యచేత పాండిత్యాన్ని సంపాదించిన ఎంతటి విద్యావంతుడైనా తాను చదువుతున్న చదువులలోని సారాంశాన్ని గ్రహించలేకపోతే ఆ చదువు వ్యర్థమే అవుతుంది. ఎవ్వరూ ఆ విద్యను మెచ్చుకోరు. పాకశాస్త్రంలో నిపుణుడయిన నలమహారాజంతటివాడే ఎంత శుచిగా చక్కగా వంట వండినా ఆ వంటలో ఉప్పు వేయకపోతే ఆ భోజనానికి పసందైన రుచి వస్తుందా? రాదు కదా!

ఉ. చేరి బలాధికుం డెరిగిఁ చెప్పిన కార్యము చేయకుండినన్
బారము ముట్టలేఁ డొక నెపంబున దాఁజెడు నెట్టి ధన్యుఁడున్
బోరక పాండుపుత్రులకు భూస్థలిభాగము పెట్టుమన్న కం
సారిని గాకుచేసి చెడఁ డాయెనె కౌరవభర్త భాస్కరా! 10

భాస్కరా! బలవంతుడైన (ధర్మాత్ముడు) వాడు తానే వచ్చి ఒక కార్యంలో సహాయం చేయుమని కోరితే తప్పక సహాయం చేయాలి. లేకపోతే అది వాడికే హాని కలిగిస్తుంది. అదెలాగంటే పూర్వం కంసుని శత్రువైన శ్రీకృష్ణుడు దుర్యోధనుని వద్దకువెళ్ళి నీ తమ్ముళ్ళైన పాండవులకు అర్ధభాగం రాజ్యం ఇవ్వాల్సిందని కోరగా అలాకాదని యుద్ధానికి సిద్ధమైన దుర్యోధనుడు ప్రాణాలను పోగొట్టుకున్నాడు కదా!

చ. తగిలి మదంబుచే నెదిరి దన్ను నెఱుంగక దొడ్డవానితో
బగఁగొని పోరుటెల్ల నతిపామరుఁడై చెడు టింతెగాక తా
నెగడి జయింప నేరఁడది నిక్కము తప్పదు; ధాత్రిలోపలన్
దెగి యొకకొండతోఁ దగరు దీకొని తాకిననేమి? భాస్కరా! 11

భాస్కరా! బలహీనుడు పొగరుతో తన బలాన్ని తాను తెలుసుకోలేక బలవంతునితో గొడవపడితే అది వాడికే నష్టం తెచ్చిపెడుతుందే కానీ

విజయాన్ని ఇవ్వదు. ఇది సత్యం. అదెలాగంటే ఈ లోకంలో పొగరుబట్టిన ఒక పొట్టేలు వెళ్ళి కొండను ఢీ కొడితే పొట్టేలుకే నష్టం కానీ కొండకు కాదు కదా!

**చ. తెలియని కార్య మెల్లఁ గడ తేర్చుట కొక్కవివేకిఁజేకొనన్**
**వలయునటైన దిద్దుకొనవచ్చు, బ్రయోజనమాంద్య మేమియుం**
**గలుగదు, ఫాలమందు దిలకంబిడునప్పుడు చేత నద్దమున్**
**గలిగిన జక్కఁజేసికొనుఁ గాదె నరుం డది చూచి భాస్కరా! 12**

భాస్కరా! ఈ లోకంలో మనకు అనుభవం లేని కార్యాన్ని సాధించాలంటే ఆ కార్యంలో అనుభవమున్న ఒక వివేకి సహాయాన్ని పొందాలి. అప్పుడు దానికి ప్రయోజన సిద్ధి కలుగుతుంది. అదెలాగంటే నుదుట బొట్టుపెట్టుకొనేటప్పుడు అద్దాన్ని చేతపట్టుకొంటే తిలకం చక్కగా తీర్చిదిద్దవచ్చును కదా!

**ఉ. దక్షుఁడు లేని యింటికిఁ బదార్థము వేఱొకచోటనుండి వే**
**లక్షలు వచ్చుచుండినఁ బలాయనమై చను గల్లగాదు, ప్ర**
**త్యక్షము వాగులున్ వఱద లన్నియు వచ్చిన నీరు నిల్చునే**
**యక్షయమైన గండి తెగినట్టి తటాకములోన భాస్కరా! 13**

భాస్కరా! అసమర్థుడైనవాని ఇంట్లో ఎన్ని సంపదలు వచ్చి చేరినా అవి నిలబడవు. వృథాగా ఖర్చయిపోతాయి. దీనికి గండి పడిన చెరువు ప్రత్యక్ష ఉదాహరణ. వరదవచ్చి వాగులుపారి చెరువు నిండినప్పటికీ ఆ చెఱువుకు గండిపడితే ఆ నీరు నిలబడదు కదా! అలాగే డబ్బు విలువ తెలిసిన యజమాని లేకపోతే ఆ ఇంట్లో ఎన్ని సంపదలైనా నిలబడవు.



**ఉ. దానము సేయగోరిన వదాన్యున కీయఁగ శక్తి లేనిచో**
**నైనఁ బరోపకారమునకై యొకదిక్కునఁ దెచ్చియైన నీఁ**
**బూనును, మేఘుఁ డంబుధికి బోయి జలంబుల దెచ్చి యీయడే**
**వాన సమస్త జీవులకు వాంఛిత మింపెసలార భాస్కరా! 14**

భాస్కరా! దానం చేయాలనే మనసున్న దాతకు దానంచేసే శక్తి లేకపోయినా పరోపకారం చేయాలన్న కోరికతో ఎక్కడినుండైనా తెచ్చి ఇచ్చేందుకు ప్రయత్నిస్తాడు. అదెలాగంటే మేఘుడు వర్షాన్ని ఇచ్చేందుకు తనవద్ద నీరు లేకపోయినా సముద్రానికి వెళ్ళి నీళ్ళు తెచ్చి సకల ప్రాణికోటికీ కోరిక తీరునట్లుగా నీటిని వర్షరూపంలో తెచ్చైనా సరే తెచ్చిస్తాడు.

**ఉ. పండితులైనవారు దిగువందగ నుండగ నల్పుఁడొక్కడు**
**ద్దండతఁ బీఠమెక్కిన బుధప్రకరంబుల కేమియెగ్గగున్?**
**గొండొక కోఁతి చెట్టు కొన కొమ్మల నుండఁగఁగ్రింద గండ భే**
**రుండ మదేభసింహ నికురుంబము లుండవె? చేరి భాస్కరా! 15**

భాస్కరా! పండితులందరూ క్రింద కూర్చొని ఉండగా ఒక దుర్మార్గుడు వారందరికంటే ఉన్నతస్థానంలో సింహాసనంపై కూర్చున్నంత మాత్రాన అది పండితులకు అవమానం ఏమీకాదు. అదెలాగంటే పక్షుల్లో గొప్పదైన గండభేరుండ పక్షి, జంతువుల్లో బలం కలిగిన గజేంద్రుడు (ఏనుగు), మృగరాజైన సింహం ఒక చెట్టుక్రింద ఉండగా ఆ చెట్టు చివరికొమ్మపైన ఒక కోతి కూర్చున్నంత మాత్రాన దానికేమి గొప్పతనం రాదు. వీటికేమి లోకువలేదు.

**చ. పలుమఱు సజ్జనుండు ప్రియభాషలె పల్కుఁగఠోరవాక్యముల్**
**బలుకఁడొకానొకప్పు డవి పల్కిన గీడును గాదు నిక్కమే;**
**చలువకువచ్చి మేఘుఁడొక జాడను దా వడగండ్ల రాల్చినన్**
**శిలలగునోటు వేగిరమె శీతల నీరము గాక భాస్కరా! 16**

భాస్కరా! సజ్జనుడైనవాడు ఎప్పుడూ మంచిమాటలే ప్రేమగా మాట్లాడుతూ ఉంటాడు. కఠినంగా మాట్లాడడు. ఒక్కోసారి కఠినంగా మాట్లాడినా అవి ఎటువంటి హాని చేయవు. ఇది సత్యం. చల్లదనం పంచేందుకు వచ్చిన మేఘుడు వడగండ్లు కురిపించినా అవి రాళ్ళుగా ఉండకుండా చల్లటి నీరుగా మారిపోతాయి కదా! అలాగే సజ్జనుని కఠినమైన మాటలుకూడా హానిని చేయవు.

**ఉ. పూనిన భాగ్యరేఖ చెడి పోయినపిమ్మట నెట్టి మానవుం**
**డైనను వాని నెవ్వరుఁ బ్రియంబునఁ బల్కరు పిల్వ రెచ్చటం**
**దానది యెట్లొకో యనినఁ దథ్యము పుష్పము వాడి వాసనా**
**హీనత నొందియున్న యెడ నెవ్వరు ముట్టుదురయ్య భాస్కరా! 17**

భాస్కరా! ఒక వ్యక్తికి దురదృష్టవశాత్తు సంపదలు తొలగిపోతే అతనిని ఎవ్వరూ పిలవరు, పలుకరించరు. అతనిని ఎక్కడ పలుకరిస్తే ఏమడుగుతాడోనన్న భయం అందరికి ఉంటుంది. అదెలాగంటే మంచి సువాసనలను వెదజల్లే పువ్వు వాడిపోయి వాసనను కోల్పోతే దాన్ని ఎవ్వరైనా తీసుకుంటారా? అలాగే సంపదలు పోయిన దురదృష్టవంతుణ్ణి కూడా ఎవ్వరూ చేరదీయరు, పలుకరించరు.



**ఉ. పూరిత సద్గుణంబుగల పుణ్యున కించుక రూపసంపదల్**
**దూరములైన వానియెడ దొడ్డగఁజూతురు బుద్ధిమంతు లె**
**ట్లారయ; గొగ్గులైన మతి యందుల మాధురిచూచి కాదె ఖ**
**ర్జూర ఫలంబులం బ్రియము చొప్పడ లోకులు గొంట భాస్కరా! 18**

భాస్కరా! సద్గుణసంపన్నులైనవారు అందంగా లేకపోయినా పండితలోకంలో వారి విలువ ఏమీ తగ్గదు. బుద్ధిమంతులైనవారు వారిని గౌరవిస్తూనే ఉంటారు. అదెలాగంటే ఖర్జూరపు పండ్లు పైకి ముడతలు ముడతలు పడి అందవికారంగా ఉన్నాకూడా పండ్ల తీపిని చూచి అందరూ ఆదరించి ఆస్వాదిస్తారు కదా!

**ఉ. బంధుర సద్గుణాఢ్యుఁ డొక పట్టున లంపటనొందియైన దు**
**స్సంధిఁ దలంప దన్యులకుఁ జాలహితం బొనరించుగాక, శ్రీ**
**గంధపుఁ జెక్క రాగిలుచుఁ గాదె శరీరుల కుత్సవార్థమై**
**గంధము లాత్మఁబుట్టు దఱుగంబడియుండుటలెల్ల భాస్కరా! 19**

భాస్కరా! మంచిగుణాలచేత ప్రకాశించేవాడైన సజ్జనుడు తాను ఎన్ని కష్టాలను అనుభవించినా ఎదుటివారికి కీడు చేయాలని ఆలోచించడు. వారికి మంచి జరగాలనే కోరుకుంటాడు. అదెలాగంటే శ్రీ గంధపుచెక్కను ఎంత అరగదీసినా అది వారికేమాత్రం కీడు చేయదు. పైగా తాను అరిగిపోయి గంధంగా మారి శరీరధారులకు సువాసనలను ఇస్తుంది. సద్గుణాల నిలయమైనపుడు తనను కష్టపెట్టిన వారుకూడా సుఖంగా ఉండాలనే కోరుకుంటాడు.

**చ. బలయుతుఁడైనవేళ నిజబంధుఁడు తోడ్పడుగాని యాత దే**
**బలము తొలంగెనేని తన పాలిట శత్రు, వదెట్లు పూర్ణుడై,**
**జ్వలనుఁడు కానఁగాల్చు తరి సఖ్యముజూపును వాయు దేవుఁడా**
**బలియుఁడు సూక్ష్మదీపమగు పట్టున నార్పదె గాలి భాస్కరా!20**

భాస్కరా! ఒక వ్యక్తి బలవంతుడుగా ఉన్నప్పుడు అతని బంధువులందరూ అతనికి బాగా సహకరిస్తారు. ఆ వ్యక్తే కనుక బలాన్ని (సంపదను) కోల్పోతే అతనికి సహకరించిన బంధువులు శత్రువులవుతారు. అదెలాగంటే అగ్నిదేవుడు అడవిని కాల్చే సమయంలో వాయువు అతనికి సహకరించి మరింత వేగంగా కాల్చేందుకు సహకరిస్తాడు. అదే అగ్ని ఒక చిన్నదీపంగా మారినప్పుడు ఆ వాయువే శత్రువుగా మారి ఒక్క ఉదుటన ఆర్పేస్తుంది. అలాగే బలంగా ఉన్నప్పుడు సహకరించిన బంధువులే బలం లేనప్పుడు శత్రువులవుతారు.

**చ. భుజబల శౌర్యవంతులగు పుత్రులఁగాంచిన వారికెయ్యెడన్**
**నిజహృదయేప్సితార్థములు నిక్కముచేకుఱుఁగుంతి దేవికిన్**
**విజయబలాఢ్యుఁడర్జునుఁడుఁ వీరపరాక్రమ మొప్ప దేవతా**
**గజమును దెచ్చి తల్లి వ్రతకార్యము దీర్పఁడె తొల్లి భాస్కరా! 21**

భాస్కరా! గొప్ప భుజబలపరాక్రమవంతులైన పుత్రుల్ని పొందిన వారికి మనసులోని కోరికలు తప్పక నెరవేరుతాయి. అదెలాగంటే కుంతీదేవి బలవంతులైన పుత్రుల్ని పొందుటవల్లనే కదా అర్జునుడు దేవతల గజమైన ఐరావతాన్ని తెచ్చి వ్రతాన్ని పూర్తి చేయించి తల్లి కోరికను తీర్చగలిగాడు.



**ఉ. సంతత పుణ్యశాలి నొక జాడను సంపద వాసిపోయి తా**
**నంతటఁబోక నెట్టుకొని యప్పటియట్ల వసించియుండు; మా**
**సొంతము నందుఁ జందురుని నన్నికళల్ పెడఁబాసిపోయినం**
**గాంతి వహింపఁడోటు? తిరుగంబడి దేహమునిండు భాస్కరా! 22**

భాస్కరా! నిత్యం పుణ్యకర్మలను చేసే పుణ్యాత్మునికి సంపదలన్నీ తొలగిపోయినా బాధపడక తాను అంతకుపూర్వం ఎలా ఉండేవాడో అలానే ఉంటాడు తిరిగి సంపదలు పొందుతాడు. అదెలాగంటే పున్నమి చంద్రుడు అమావాస్యనాటికి తన కాంతినంతా కోల్పోయి కాంతిహీనుడైనా కూడా అలాగే ఉంటూ క్రమంగా తన పున్నమిచంద్రుని రూపాన్ని పొందుతున్నాడో? అలాగే పుణ్యశాలికూడా తన సంపదలు తొలగిపోయినా బాధపడకుండా ఉంటూ తిరిగి సంపాదించుకుంటాడు.

**చ. సిరిగలవాని కెయ్యెడలఁ జేసిన మేలది నిష్ఫలంబగున్**
**నెఱిగుఱిగాదు పేదలకు నేర్పునఁజేసిన సత్ఫలంబగున్**
**వఱపున వచ్చి మేఘుఁడొక వర్షము వాడిన చేలమీఁదటం**
**గురిసినఁగాక యంబుధులఁ గుర్వఁగ నేమిఫలంబు భాస్కరా! 23**

భాస్కరా! సిరిసంపదలున్న ధనవంతునికి అన్నివేళలా చేసే సహాయం నిష్ప్రయోజనమే అవుతుంది. ఫలితం ఉండదు. అదే సహాయాన్ని బీదవారికి చేస్తే, మంచిఫలితం లభిస్తుంది. అదెలాగంటే వర్షాన్ని కురిపించేందుకు వచ్చిన మేఘుడు తన వర్షధారను వాడిపోయిన పొలాలపై కురిపిస్తే అది ప్రయోజనంగా ఉంటుంది. ఫలితాన్నిస్తుంది. కానీ అదే వర్షాన్ని సముద్రంలో కురిపిస్తే ప్రయోజనమేమైనా ఉన్నదా? లేదు కదా? అలాగే ఎవరికి సహాయం అవసరమో వారికి సహాయం

చేయాలి కానీ, అవసరం లేనివారికి సహాయం చేయడం వ్యర్థమే అవుతుంది.

**చ. స్థిరతర ధర్మవర్తన బ్ర । సిద్ధికి నెక్కినవాని నొక్క ము**
**ష్కరుఁ డతి నీచవాక్యములఁ । గాదని పల్కిన నమ్మహాత్ముఁడుం**
**గొఱఁతవహింపఁడయ్యెడ, న । కుంఠిత పూర్ణసుధాపయోధిలో**
**నరుగుచుఁ గాకి రెట్టయిడి । నందున నేమి కొఱంత భాస్కరా! 24**

ధర్మంతప్పని ధర్మాత్ముడని పేరుపొందిన వానిని ఒక నీచుడు కఠినమైన మాటలతో నిందించినా అది తన ధర్మవర్తనకు లోపమని భావించడు. అదెలాగంటే విశాలమైన అమృత సముద్రంపై ఒక కాకి ఎగురుతూ నిండైన ఆ సముద్రంలో రెట్ట వేసినంత మాత్రాన సముద్రానికి లోపమేమి లేదుకదా!

* * *



# శ్రీకృష్ణ శతకము

**శ్రీకృష్ణ శతకాన్ని వ్రాసినవారు నరసింహ కవి. ఈయన 1775 ప్రాంతానికి చెంది ఉండవచ్చునని పరిశోధకుల అభిప్రాయం. ఈ శతకంలో పద్యాలు సరళంగా, సుబోధకంగా ఉంటాయి. ఈ శతకం భక్తిప్రబోధాత్మక శతకం. ఈ శతకంలోని పద్యాలు బాలబాలికలకు తేలికగా అర్థమవుతాయి. కవి పద్యశైలీవిధానం పద్యాలను సులభంగా కంఠస్థం చేయడానికి తోడ్పడుతుంది.**

**క. శ్రీ రుక్మిణీశ! కేశవ!**
**నారదసంగీతలోల! నగధర! శౌరీ!**
**ద్వారకనిలయ! జనార్దన!**
**కారుణ్యముతోడ మమ్ము గావుము కృష్ణా! 1**

ఓ కృష్ణా! నువ్వు లక్ష్మీస్వరూపిణి అయిన రుక్మిణీదేవికి భర్తవు, సకల విశ్వాన్ని సృష్టించినవాడవు, నారద మహర్షి సంగీతంచేత అత్యంత ఆనందాన్ని పొందువాడవు, గోవర్ధనగిరిని వ్రేలిపై ఎత్తిన పరాక్రమవంతుడవు, ద్వారకానగరంలో నివసించేవాడవు, జనార్దనుడవు, మాపై కరుణ చూపి కాపాడవయ్యా!

**క. నీవే తల్లివిఁదండ్రివి**
**నీవే నా తోడు నీడ నీవే సఖుఁడౌ**
**నీవే గురుఁడవు దైవము**
**నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా! 2**

కృష్ణా! నిజంగా నాకు నీవే తల్లివి, నీవే తండ్రివి, నీవే సోదరుడివి, స్నేహితుడివి, నీవే గురువువు, నీవే దైవానివి, నీవే నాకు భర్తవు (అధిపతి) నీవే నాకు గతివి (రక్షించి మోక్షమిచ్చేవాడవు). కృష్ణా! ఇది సత్యం.

క. హరి యను రెండక్షరములు
హరియించును పాతకముల నంబుజనాభా
హరి నీ నామ మహత్త్వము
హరి హరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా! 3

కృష్ణా! 'హరి' అనే రెండు అక్షరాలు సకల పాపాలను హరింపజేస్తాయి (నశింపజేస్తాయి). పద్మనాభా! ఓ శ్రీహరీ! నీ పేరులో ఉన్న మాహాత్మ్యాన్ని తెలుసుకొని స్తుతించడానికి హరి హరి నాకు సాధ్యమా! (అసాధ్యం అని అర్థం).

క. చిలుక నొక రమణి ముద్దుల
చిలుకను 'శ్రీరామ'యనుచు శ్రీపతి పేరన్
బిలిచిన మోక్షము నిచ్చితి
వలరగ మిము దలంచు భక్తవత్సల! కృష్ణా! 4

కృష్ణా! పూర్వం ఒక వనిత తన పెంపుడు రామచిలుకను ముద్దుగా శ్రీరామా! శ్రీరామా! అని పిలిచింది. అంతమాత్రానికే ఆమెకు మోక్షాన్ని ప్రసాదించావు. అటువంటిది నీపై భక్తితో, ప్రేమతో నీ నామస్మరణ చేసేవారికి మోక్షం రాకుండా ఉంటుందా? నీవు భక్తులపట్ల వాత్సల్యం గలవాడివి కదా!

క. వేదంబులు గననేరని
యాది పరబ్రహ్మమూర్తి వనఘ! మురారీ!
నా దిక్కుజూచి కావుము
నీ దిక్కే నమ్మినాఁడ నిజముగ కృష్ణా! 5



కృష్ణా! వేదాలకు కూడా అంతు చిక్కనిది నీ దివ్యమంగళదర్శనం. పుణ్యస్వరూపా! మురాసురుని సంహరించినవాడా! కృష్ణా! నీవే దిక్కని నమ్మినాను. స్వామీ! నాపై నీ చల్లని చూపులను ప్రసరింపజేయుము.

క. మడుగుకు జని కాళీయుని
పడగలపై భరతశాస్త్ర పద్ధతి వెలయన్
గడు వేడుకతో నాడెడు
నడుగులు నా మదిని దలఁతు నచ్యుత కృష్ణా! 6

కృష్ణా! గోకులంలో కాళీయుడనే సర్పరాజు నివాసమేర్పరచుకున్న మడుగులోకి దూకి కాళీయుని పడగలపై భరతనాట్యశాస్త్ర పద్ధతిలో చక్కగా ఆనందంగా నృత్యం చేశావు. అటువంటి ఆనందనృత్యం చేసిన పాదాలను నేను సదా మనసులో స్మరిస్తున్నాను.

క. దేవేంద్రుఁడలుక తోడను
వావిరిగా ఱాళ్ళవాన వడి గుఱియింపన్
గోవర్ధనగిరి యెత్తవె
గోవుల గోపకుల గాచు కొఱకై కృష్ణా! 7

కృష్ణా! గోపాలకులందరూ తనకు బదులుగా గోవర్ధనగిరిని పూజించడం చూసి కోపగించుకున్న దేవేంద్రుడు ఎడతెరపి లేకుండా రాళ్ళవర్షం వేగంగా కురిపించగా గోవర్ధనగిరిని ఎత్తి ఆ గోవులను, గోపాలకులను రక్షించావు కదయ్యా!

క. గిరులందు మేరువౌదువు
సురలందున నింద్రుఁడౌదు చుక్కలలోనన్
బరమాత్మ! చంద్రుఁడౌదువు
నరులందున నృపతివౌదు నయముగఁ కృష్ణా! 8

ఓ కృష్ణా! పరమాత్మా! ఈ యుగంలో సకలసృష్టికి ఆధారభూతుడవు నీవే. పర్వతాల్లో ఎత్తైన మేరుపర్వత శిఖరానివి నీవే. దేవతల్లో ఇంద్రుడవు నీవే. నక్షత్రాల్లో ప్రధానమైన చంద్రుడివి మానవుల్లో రాజువు నీవేనయ్యా! (ఈ పద్యంలో కవి భగవద్గీత శ్లోకాన్ని గుర్తుకు తెస్తున్నది).

**క. విశ్వోత్పత్తికి బ్రహ్మవు**
**విశ్వము రక్షింపఁదలఁచి విష్ణుఁడవనఁగా**
**విశ్వము జెరుపను హరుఁడవు**
**విశ్వాత్మక! నీవె యగుదు వెలయఁగ కృష్ణా! 9**

ఓ కృష్ణా! ఈ విశ్వాన్ని సృష్టించడంలో సృష్టికర్త అయిన బ్రహ్మవు నీవే. విశాలమైన ఈ (విశ్వాన్ని) ప్రపంచాన్ని రక్షించడంలో విశ్వవ్యాపి అయిన శ్రీమహావిష్ణువువు, ఈ విశ్వాన్ని అంతం చేయడంలో (నశింపజేయడంలో) పరమశివుడవు నీవు! విశ్వవిశ్వాంతరాలు వ్యాపించిన విశ్వాత్మకుడవు నీవే కృష్ణా!

*(ఈ పద్యంలో శ్రీహరిని సృష్టి స్థితి లయకారకుడైన త్రిమూర్తి స్వరూపుడుగా కవి స్తుతిస్తున్నాడు).

**క. మగమీనమవై జలధిని**
**పగతుని సోమకుని జంపి పద్మభవునకున్**
**నిగమముల దెచ్చి యిచ్చితి**
**సుగుణాకర! మేలు దివ్యసుందర కృష్ణా! 10**

ఓ కృష్ణా! మగచేపగా అవతరించి సముద్రంలో ప్రవేశించి శత్రువైన సోమకాసురుడిని చంపి, వేదాలను సంరక్షించి పద్మంనుండి పుట్టిన



బ్రహ్మదేవునికి అప్పగించితివి. కృష్ణా! నువ్వు సద్గుణాలకు నిలయమైన దివ్యసుందరమూర్తివి.

**క. అందఱు సురలును దనుజులు**
**పొందుగ క్షీరాబ్ధి దఱవఁ బొలుపున నీ వా**
**నందముగ కూర్మరూపున**
**మందరగిరి యెత్తితౌర మాధవ కృష్ణా! 11**

లక్ష్మీనాథా! ఓ కృష్ణా! దేవతలు, రాక్షసులు, అమృతభాండంకోసం పాలసముద్రాన్ని చిలికే సందర్భంలో అందరికీ ఆనందం కలిగేటట్లుగా కూర్మ (తాబేలు) రూపాన్ని ధరించి మందరపర్వతాన్ని ఎత్తావు కదా! ఎంత ఆశ్చర్యమో కదా!

**క. ఆదివరాహుఁడవయి నీ**
**వా దనుజు హిరణ్యనేత్రు హతుజేసితివౌ**
**మోదమున సురలు పొగడఁగ**
**మేదిని గిరి గొడుగునెత్తి మెఱసిన కృష్ణా! 12**

కృష్ణా! హిరణ్యాక్షుడనే రాక్షసుడు భూగోళాన్ని ఆక్రమించి రసాతలానికి తీసుకుపోగా నీవు వరాహరూపాన్ని ధరించి దేవతలు ఆనందంతో పొగడుతుండగా కొండను గొడుగుగా ఎత్తిన కృష్ణా!

**క. కెరలి యఱచేత కంబము**
**నరుదుగ వేయుటను వెడలి యసురేశ్వరునిన్**
**ఉరమును జీరి వధించితి**
**నరహరి రూపావతార నగధర కృష్ణా! 13**

కృష్ణా! గోవర్ధనగిరిని ఎత్తిన శ్రీకృష్ణా! హిరణ్యకశిపుడనే రాక్షసుడు తన కుమారుడైన ప్రహ్లాదునితో "నీ శ్రీహరిని స్తంభంలో చూపించు" అంటూ తన అరచేతితో స్తంభంపై గట్టిగా కొట్టగా దాన్ని చీల్చుకొని నరమృగ శరీరంతో (సింహముఖం, మానవదేహంతో) నరసింహుడవై అవతరించి ఆ హిరణ్యకశిపుని రొమ్మును చీల్చి సంహరించావు.

**క. వడుఁగడవై మూఁడడుగుల**
**నడిగితివౌ భళిర భళిర, యఖిల జగంబుల్**
**తొడిగితివి నీదు మేనున**
**గడుచిత్రము నీ చరిత్ర ఘనుడవు కృష్ణా! 14**

ఓ కృష్ణా! బాలవటువు (బ్రహ్మచారి) రూపంలో బలిచక్రవర్తి వద్దకువచ్చి మూడడుగుల నేలను దానంగా పుచ్చుకొని, రెండడుగులకు భూమి, ఆకాశాలను ఆవరించి మూడవ అడుగును అతని తలపై పెట్టి అందరూ భళి భళి అంటుండగా పాతాళానికి పంపిన గొప్ప చరిత గలవాడవు నీవు కదయ్యా!

**క. ఇరువ దొకమారు నృపతుల**
**శిరములు ఖండించితౌర చే గొడ్డంటన్**
**ధర గశ్యపునకు నిచ్చియు**
**బరగవె జమదగ్నిరామభద్రుఁడ కృష్ణా! 15**

కృష్ణా! పరశురామావతారంలో నీ తండ్రి అయిన జమదగ్ని మహర్షిని క్షత్రియరాజు సంహరించగా గొడ్డలిని చేత ధరించి ఇరవై ఒక్కసార్లు భూలోకాన్నంతా తిరిగి క్షత్రియరాజుల తలలను తెగనరికి ఈ భూమిని కశ్యప మహర్షికి ఇచ్చితివి కదయ్యా జమదగ్ని రామభద్రా!



**క. దశకంఠుని బరిమార్చియు**
**కుశలముతో సీత దెచ్చి కొనియు నయోధ్యన్**
**విశదముగ కీర్తి నేలితి**
**దశరథరామావతార ధన్యుడ కృష్ణా! 16**

కృష్ణా! రామావతారంలో సీతాదేవిని అపహరించిన రావణాసురుని సంహరించి సీతాదేవిని భద్రంగా తీసుకువచ్చి అయోధ్యను చక్కగా పాలించి కీర్తిని తెచ్చితివి కదయ్యా!

**క. ఘనులగు ధేనుక ముష్టిక**
**దనుజుల చెండాడితౌర తగ భుజశక్తిన్**
**అనఘాత్మ! రేవతీపతి**
**యనఁగన్ బలరామమూర్తి వైతివి కృష్ణా! 17**

కృష్ణా! రేవతీదేవికి భర్తవై బలరామావతారాన్ని ధరించి నీ భుజబల శక్తిచేత మహాక్రూరులైన ధేనుక, ముష్టికులనే రాక్షసులను సంహరించిన మహానుభావుడవయ్యా!

**క. త్రిపురాసుర భార్యల నతి**
**నిపుణతతో వ్రతముచేత నిలిపితి కీర్తుల్**
**కపటవు రాజవు భళిరే**
**కృపగల బౌద్ధావతార కేశవ కృష్ణా! 18**

దయాస్వరూపుడవైన కేశవా! కృష్ణా! లోకకంటకుడైన త్రిపురాసురుని భార్యలను వ్రతం పేరుతో అనుగ్రహించి కీర్తిమంతులను చేసిన బుద్ధావతార హరివి నీవే. భళి, భళి, కపటరాజువై వారి కీర్తిని ఈ లోకంలో నిలిపిన నిన్ను ఏమని స్తుతించగలను.

క. వలపులతేజీ నెక్కియు
నిలపై ధర్మంబు నిలుప హీనుల దునుమన్
కలియుగము తుదిని వేడుకఁ
కలికివిగా నున్న లోక కర్తవు కృష్ణా! 19

ఓ కృష్ణా! ఈ భూమిపై ధర్మాన్ని నిలిపి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసేందుకు కలియుగం చివరన అందమైన గుర్రాన్ని ఎక్కి వేడుకగా వచ్చే కల్కి అవతార హరివి, లోకాలను సృష్టించినవాడవు నీవే సుమా!

క. దిక్కెవ్వరు ప్రహ్లాదుకు
దిక్కెవ్వరు పాండుసుతుల దీనుల కెపుడున్
దిక్కెవ్వ రా యహల్యకు
దిక్కెవ్వరు నీవె నాకు దిక్కువు కృష్ణా! 20

హే శ్రీకృష్ణా! రాక్షసరాజు హిరణ్యకశిపుని కుమారుడైన ప్రహ్లాదునికి దిక్కెవరయ్యా! ధర్మాత్ములైన పాండురాజ పుత్రులు ఎల్లపుడు అండగా ఉండిన దిక్కెవరయ్యా! ఏ దిక్కూలేని దీనులను, హీనులను నిరాశ్రయులకు, దిక్కెవరయ్యా? గౌతమమహర్షి భార్య పరమపతివ్రత అయిన అహల్యను (శాపవిమోచనం కల్పించిన) దిక్కెవరయ్యా? వీరందరికీ దేవాదిదేవుడవైన నీవే దిక్కు కదా! అటువంటి నీవు నాకుకూడా దిక్కువు (రక్షించేవాడవు).

క. హరి! నీవె దిక్కు నాకును
సిరితో నేతెంచి మకరి శిక్షించి దయన్
బరమేష్ఠి సురలు బొగడఁగ
కరి గాచినరీతి నన్ను గావుము కృష్ణా! 21



కృష్ణా! లక్ష్మీదేవితోపాటుగా విచ్చేసి మొసలి తలను ఖండించి (మొసలిని శిక్షించి) బ్రహ్మాదిదేవతలు పొగడుతుండగా దయతో గజేంద్రుని రక్షించిన విధంగా నన్నుకూడా కాపాడవయ్యా శ్రీహరీ! నీవే నాకు దిక్కు!

క. బలమెవ్వఁడు కరి బ్రోవను
బలమెవ్వఁడు పాండుసుతుల భార్యను గావన్
బలమెవ్వఁడు సుగ్రీవుకు
బలమెవ్వఁడు నాకు నీవె బలమౌ కృష్ణా! 22

కృష్ణా! మొసలి బారినుండి గజేంద్రుని రక్షించిన 'శక్తి' ఎవరు? పాండవుల ఇల్లాలైన ద్రౌపదీ దేవికి వస్త్రాపహరణ సమయంలో రక్షించిన శక్తి ఎవరు? వాలిని ఎదిరించి పోరాడి విజయం సాధించడంలో సుగ్రీవునికి బలంగా నిలిచిందెవరు? వారందరికీ అండగా నిలిచి రక్షించినవాడవు నీవే కదా! అటువంటి నీవే నాకూ బలానివి (రక్షకుడవు).

క. పరుసము సోకిన యినుమును
వరుసగ బంగారమైన వడుపున జిహ్వన్
హరి నీ నామము సోకిన
సురవందిత నేను నటుల సులభుఁడ కృష్ణా! 23

దేవతలచేత స్తుతింపబడేవాడా! కృష్ణా! పరుసవేది (స్పర్శవేది) ఇనుమును తాకుతూ ఉంటే క్రమంగా ఇనుముకూడా బంగారంగా మారిపోతుంది. అలాగే నీనామం నాలుకపై ఆడుతూంటే (జపిస్తూ ఉంటే) నేనుకూడా సులభంగా మోక్షాన్ని పొందగలను.

**క. నీ నామము భవహరణము**
**నీ నామము సర్వసౌఖ్య నివహాకరంబున్**
**నీ నామ మమృత పూర్ణము**
**నీ నామము నే దలంతు నిత్యము కృష్ణా! 24**

కృష్ణా! నీ నామాన్ని జపిస్తే సంసార బాధలు తొలగిపోతాయి. నీ నామస్మరణ సకల సుఖాలను ప్రసాదిస్తుంది. నీ నామం అమృతంతో నిండి ఉంటుంది. అటువంటి పరమపవిత్రమైన (దివ్యమైన) నీ నామాన్ని నేను నిత్యం స్మరిస్తూ ఉంటాను.

**క. దండమయా విశ్వంభర**
**దండమయా! పుండరీక దళనేత్ర హరీ!**
**దండమయా కరుణానిధి**
**దండమయా నీకు నెపుడు దండము కృష్ణా! 25**

కృష్ణా! సకల లోకాలను భరిస్తున్న నీకు నమస్కరిస్తున్నాను. తెల్లని కలువరేకులవంటి కన్నులు కల శ్రీహరీ నీకు వందనాలు. కరుణకు నిధి అయినవాడా నీకు వందనం. శ్రీహరీ నీకు నిరంతరం నమస్కరిస్తుంటానయ్యా!

* * *



# దాశరథీ శతకము

**దాశరథీ శతకకర్త కంచర్ల గోపన్న. ఈయనకే రామదాసు అని పేరు. ఈయన 16వ శతాబ్దానికి చెందినవాడు. కొత్తగూడెం జిల్లా భద్రాచలం తాలూకలోని నేలకొండపల్లి నివాసి. ఈయన గోల్కొండ నవాబు అబుల్ హసన్ తానీషా కాలంలో తహశీల్దారుగా పనిచేస్తూ భద్రాచల శ్రీరామునికి ఆలయాన్ని నిర్మించాడు. ఈ శతకం భక్తిప్రబోధాత్మకమైన శతకం. తెలుగు శతకాల్లో మకుటాయమానమైంది. కవి ఆర్తి, భగవంతునిపట్ల ఆయనకున్న భక్తిప్రపత్తులు ప్రతి పద్యంలోనూ కన్పిస్తాయి.**

**ఉ. శ్రీరఘురామ, చారుతులసీదళదామ, శమక్షమాది శృం**
**గార గుణాభిరామ, త్రిజగన్నుతశౌర్యరమాలలామ దు**
**ర్వారకబంధరాక్షసవిరామ, జగజ్జన కల్మషార్ణ వో**
**త్తారకనామ! భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ 1**

ఇక్ష్వాకువంశంలో శ్రేష్ఠుడైన రఘుమహారాజు వంశంలో జన్మించినవాడా! అందమైన తులసీదళాల దండను ధరించి, శాంతి, ఓర్పు అనే గుణాలతో ప్రకాశించేవాడా! ముల్లోకాలచేత పొగడబడే శౌర్యలక్ష్మిని ఆభరణంగా కలవాడా! ఎవరిచేతా ఎదిరింప సాధ్యంకాని కబంధుడనే రాక్షసుని సంహరించినవాడా! సకల జనులను పాపాలనే సముద్రాన్ని దాటించే 'రామ' అనే పేరు కలవాడా! భద్ర అనే కొండపై (భద్రాచలంపై) వెలసిన దశరథ మహారాజు కుమారుడవైన శ్రీరామా!

**ఉ. అండజవాహ నిన్ను హృదయంబున నమ్మినవారి పాపముల్**
**కొండలవంటివైన వెసఁ గూలి నశింపక యున్నె? సంతతా**
**ఖండల వైభవోన్నతులు గల్గక మానునె? మోక్షలక్ష్మి కై**
**దండ యొసంగకున్నె? తుద దాశరథీ కరుణాపయోనిధీ 2**

గరుత్మంతుని వాహనంగా కలవాడా! కరుణా సముద్రా! శ్రీరామా! నిన్నే నమ్ముకున్నవారు కొండంత పాపాలు చేసినవారైనా వారి పాపాలు (నశించకుండా) పటాపంచలు కాకుండా ఉంటాయా? ఎనలేని సంపదలు వైభవాల గొప్పతనాలు కలుగకుండా ఉంటాయా? చివరకు మోక్షలక్ష్మి వారిని వరించకుండా ఉంటుందా? (మోక్షం కలుగకుండా ఉంటుందా?)

**ఉ. చిక్కనిపాలపై మిసిమిఁ జెందిన మీఁగడ పంచదారతో**
**మెక్కినభంగి నీ విమలమేచకరూపసుధారసంబు నా**
**మక్కువ పళ్ళెరంబున సమాహిత దాస్యమనేటి దోయిటన్**
**దక్కె నటంచు జుర్రెదను దాశరథీ కరుణాపయోనిధీ 3**

దశరథ రాజకుమారా! కరుణా సముద్రా! శ్రీరామా! చిక్కని పాలపై వచ్చే వెన్నతోకూడిన మీగడను పంచదార (చక్కెర)తో కలిపి తిన్నట్లుగా, నీలమేఘశ్యాముడి (రంగు) వైన నీ రూపం అనే అమృతరసాన్ని ప్రేమ అనే పళ్లెంలో పోసుకుని శ్రద్ధగా దాస్య అనే దోసిట్లో తీసుకుని ఇష్టంగా తింటాను స్వామీ!

**చ. సిరులిడ సీత, పీడలెగ జిమ్ముటకున్ హనుమంతుఁడార్తి సో**
**దరుఁడు సుమిత్రసూతి దురితంబులు మానుప రామనామమున్**
**గరుణఁ దలిర్ప మానవులఁ గావగఁబన్నిన వజ్రపంజరో**
**త్కరముగదా భవన్మహిమ దాశరథీ కరుణాపయోనిధీ 4**



కరుణాసముద్రా! దశరథ రామా! సంపదలను ఇచ్చేందుకు నీ భార్య అయిన సీతాదేవి (లక్ష్మీస్వరూపిణి), పీడలనుండి కాపాడేందుకు నీ సేవకుడైన హనుమంతుడు, బాధలనుండి కాపాడేందుకు నీ సోదరుడైన లక్ష్మణుడు, సకల పాపాలనుండి విముక్తిని కల్పించేందుకు పవిత్రమైన రామనామము – కరుణతో మానవులను కాపాడేందుకు నీ మహిమచేత ఏర్పరచిన వజ్రపంజరమే కదా!

**ఉ. భండన భీముఁడార్తజన బాంధవుఁడుజ్జ్వల బాణతూణ కో**
**దండ కళా ప్రచండ భుజ తాండవకీర్తికి రామమూర్తికిన్,**
**రెండవ సాటి దైవమిఁక లేఁడనుచున్ గడగట్టి భేరికా**
**ధాండడ ధాండ ధాండ! నిన దంబులజాండము నిండమత్త వే**
**దండము నెక్కి చాటెదను దాశరథీ కరుణాపయోనిధీ 5**

కరుణాసముద్రా! దశరథరామా! యుద్ధరంగంలో శత్రువులపాలిట మృత్యుభయంకరుడు, ఆపదలో ఉన్నవారిని ఆదుకొనే ఆపద్బాంధవుడు, ధనుర్విద్యలో సాటిలేని మేటివీరుడు, భుజబలంలో ఎదురులేనివాడు అయిన శ్రీరామునికి సాటిరాగల రెండవదైవం మరొకరు లేరని గర్వంగా ఏనుగునెక్కి ధాం... ధాం... ధాం... అంటూ ఢంకా వాద్యాలను మోగిస్తూ బ్రహ్మాండమంతా వినబడేలా ప్రకటిస్తాను.

**ఉ. "రా" కలుషంబు లెల్ల బయ। లంబడ ద్రోచిన "మా" కవాటమై**
**ధీకొని ప్రోచు నిక్కమది। ధీయుతులెన్నఁదదీయ వర్ణముల్**
**గైకొని భక్తిచే నుడువఁ। గానరు గాక ! విపత్పరంపరల్**
**దాకొనునే జగజ్జనుల। దాశరథీ కరుణాపయోనిధీ. 6**

దశరథరాజ కుమారా! కరుణాసముద్రా! 'రా' అనే అక్షరం పాపాలను తొలగిస్తుంది 'మ' అనే అక్షరం తలుపుగా నిల్చి తిరిగి పాపం

దరిచేరకుండా కాపాడుతుంది. ఈ సత్యాన్ని గ్రహించి 'రామ' అనే అక్షరాలను భక్తితో జపించలేకపోతున్నారు కనుకనే ఒక దానివెంట ఒకటి కష్టాలు లోకులకు వచ్చిపడుతున్నాయి. రామ నామ స్మరణం సకల పాపహరణం.

**ఉ. అంచితమైన నీదు కరుణామృతసారము నాదుపైనిఁ బ్రో**
**క్షించినఁజాలు దాన నిరసించెద నా దురితంబులెల్లఁ దూ**
**లించెద వైరివర్గ మెడలించెదఁ గోర్కెల నీదు బంటనై**
**దంచెద గాలకింకరుల దాశరథీ కరుణాపయోనిధీ! 7**

కరుణాసాగరా! దశరథ రాజకుమారా! శ్రీరామా! మహామహిమాన్వితమైన నీ కరుణారసాన్ని నాపై రవ్వంత కురిపించినా చాలు. దాని ప్రభావంచేత నా పాపాలను తొలగించుకుంటాను. శత్రుసమూహాలను (అరిషడ్వర్గాలను) జయిస్తాను. కోరికలను వదలి నీ దాసానుదాసుడనౌతాను. యమభటులు వస్తే వారిని కూడా తరిమికొడతాను.

**ఉ. కోతికిశక్యమా యసుర - కోటుల గెల్వను? గెల్చెఁబో నిజం**
**బాతని మేన శీతకరుఁ డౌట దవానలుఁడెట్టివింత, మా**
**సీతపతివ్రతామహిమ - సేవక భాగ్యము మీకటాక్షమున్**
**ధాతకు శక్యమా పొగడ దాశరథీ కరుణాపయోనిధీ 8**

దశరథరాజ కుమారా! కరుణాసముద్రా శ్రీరామా! కోటానుకోట్ల రాక్షసులను గెలవడం ఒక కోతికి సాధ్యమవుతుందా? గెలిచెనే అనుకుందాం. కానీ అతని తోకకు పెట్టిన నిప్పు కాలకుండా చల్లగా ఉండడం ఎంత ఆశ్చర్యం? దీనికి కారణం సీతమ్మతల్లి పాతివ్రత్య



మహిమ, నీ సేవాభాగ్యం. నీ దయాగుణాన్ని వర్ణించేందుకు బ్రహ్మదేవునికైనా తరం కాదు.

**చ. చరణము సోకినట్టి శిల జవ్వనిరూపగు టొక్క వింత సు**
**స్థిరముగ నీటిపై గిరులు దేలిన దొక్కటి వింతగాని మీ**
**స్మరణఁదనర్చు మానవులు సద్గతిచెందిన దెంత వింత, యీ**
**ధరను ధరాత్మజారమణ దాశరథీ కరుణాపయోనిధీ 9**

దయాసముద్రా! దశరథనందనా! శ్రీరామా! నీ పాదాలు తాకగానే ఒక రాయి స్త్రీగా మారడం ఒక ఆశ్చర్యం. పెద్ద పెద్ద బండరాళ్ళు నీటిపై తేలడం మరో ఆశ్చర్యం. భూదేవి కుమార్తె అయిన సీతాదేవికి భర్త అయిన శ్రీరామా! ఈ భూమిపై మీ నామస్మరణతోనే మానవులు మోక్షాన్ని పొందడం ఇంకెంతో ఆశ్చర్యం కదా!

**చ. సిరిగలనాఁడు, మైమఱచి చిక్కిననాఁడు, దలంచి పుణ్యముల్**
**పొరిఁ బొరి సేయనైతినని పొక్కినఁగల్గునె? గాలి చిచ్చుపైఁ**
**గెరలినవేళఁ దప్పిగొని కీడ్పడువేళ జలంబుఁగోరి త**
**త్తరమునఁ ద్రవ్వినంగలదె! దాశరథీ కరుణాపయోనిధీ!! 10**

కరుణాసముద్రా! దశరథరామా! (దేహ) సంపదలున్న రోజుల్లో మరచిపోయి ముసలితనం వచ్చాక అయ్యో! పుణ్యకార్యాలు చేయలేక పోయానే అని ఎంత బాధపడినా ప్రయోజనం ఏముంది? అగ్ని దహిస్తుండగా గాలి దానితోపాటు విజృంభించిన సమయంలో (తోడైనవేళ); విపరీతమైన దాహంతో ఉన్నవేళ అప్పుడు అనుకొని బావి త్రవ్వడానికి ప్రయత్నిస్తే ఫలితమేమీ ఉండదు. కాబట్టి, వయసులో ఉన్నప్పుడే పుణ్యకార్యాలు చేయాలి.

**ఉ. రామ, విశాల విక్రమ పరాజిత భార్గవరామ, సద్గుణ**
**స్తోమ, పరాంగనావిముఖ సువ్రతకామ! వినీల నీరద**
**శ్యామ! కకుత్థ్సవంశ కలశాంబుధిసోమ! సురారి దోర్బలో**
**ద్దామవిరామ! భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ! 11**

దైవీగుణాలచేత జనులందర్నీ రమింపజేసేవాడా! సాటిలేని పరాక్రమంచేత భార్గవరాముని ఓడించినవాడా! సద్గుణాలకు నిలయమైనవాడా! పరస్త్రీలయందు ఆసక్తిలేనివాడా! (తల్లితో సమానంగా చూచేవాడా!) (పరస్త్రీలను తల్లిగా భావించే మంచి వ్రతం (నియమం) కలవాడా!) నీలమేఘవర్ణంతో ప్రకాశించేవాడా! కాకుత్థ్స వంశకలశమనే సముద్రంలో పుట్టిన చంద్రునివంటివాడా! దయాసాగరా! శ్రీరామా!

**ఉ. దారుణ పాతకాబ్ధికి సదా బడబాగ్ని భవాకులార్తి వి**
**స్తార దవానలార్చికి సుధారసవృష్టి దురంత దుర్మతా**
**చార భయంకరాటవికిఁ జండ కఠోర కుఠారధార నీ**
**తారకనామ మెన్నుకొన దాశరథీ కరుణాపయోనిధీ! 12**

దయాసముద్రా! దాశరథీ! నీ పరమపవిత్రమైన రామనామస్మరణం మా పాపాలనే సముద్రంలో పుట్టే బడబాగ్నివంటిది. సాంసారిక బాధలనే కారుచిచ్చులో దహింపబడేవారికి నీ నామం అమృతవర్షం వంటిది. అంతేకాదు, దుర్మతాచారాలనే అడవిని నిర్మూలించడంలో బలమైన, కఠినమైన, సానబెట్టిన గొడ్డలి వాడిమొన వంటిది స్వామీ!

**చ. హరునకు నవ్విభీషణున కద్రిజకున్ దిరుమంత్రరాజమై**
**కరికి నహల్యకున్ ద్రుపదకన్యకు నార్తిహరించు చుట్టమై**
**పరగిన యట్టి నీ పతితపావననామము జిహ్వపై నిరం**
**తరము నటింపజేయు మిక దాశరథీ కరుణాపయోనిధీ! 13**



కరుణాసాగరా! దశరథరామా! నీ పరమ పవిత్రమైన రామనామం శివునికి, విభీషణునికి, పార్వతీదేవికి శ్రీకరమైన, తారకమంత్రమై భాసిల్లింది. ఇక గజేంద్రునికి, అహల్యకు, ద్రౌపదికి వారి వారి దుఃఖాలను తొలగించే బంధువుగా, పరమపావనమై ప్రకాశించింది. అటువంటి పవిత్రమైన నీ నామాన్ని నా నాలుకపై నిరంతరం నిలిచేలా చేయి స్వామీ!

**చ. పరమదయానిధే! పతిత పావననామ! హరేయటంచు సు**
**స్థిరమతులై సదా భజన సేయు మహాత్ముల పాదధూళి నా**
**శిరమునదాల్తు మీరటకు జేరకుడంచు యముందు కింకరో**
**త్కరముల కాన బెట్టునట దాశరథీ కరుణాపయోనిధీ! 14**

కరుణాసింధూ! ఓ దశరథ రాజకుమారా! నీవు అద్భుతమైన దయకు నిధివంటివాడవు. నీ నామమే పరమపవిత్రంగా భావించి నిన్ను భజించే నీ గుణగానాన్ని కీర్తించే మహాత్ములైన నీ భక్తుల పాదధూళిని నా తలపై ధరిస్తాను. మీరక్కడకు (హరిభక్తులున్న చోటకు) వెళ్ళవద్దంటూ యముడు తన భటులను ఆజ్ఞాపిస్తాడట కదా!

**చ. రాముఁడు ఘోరపాతక విరాముఁడు, సద్గుణకల్పవల్లికా**
**రాముఁడు, షడ్వికార జయరాముఁడు, సాధుజనావనవ్రతో**
**ద్దాముఁడు, రాముడే పరమ దైవము మాకని మీ యడుంగు గెం**
**దామరలే భజించెదను దాశరథీ కరుణాపయోనిధీ! 15**

దయాసాగరా! శ్రీరామా! నీవు భయంకరమైన పాపాలను తొలగించేవాడవు. సద్గుణాలనే కల్పవృక్షపు తీగలకు నిలయమైన తోటవంటివాడవు. చావుపుట్టుకలతో కూడిన ఆరువిధాలైన వికారాలను

జయించినవాడవు. సజ్జనులను సంరక్షణ చేసే దీక్షను చేపట్టినవాడవు. కాబట్టి, రాముడే మాకు పరమదైవమంటూ ఎర్రతామరలవంటి నీ పాదాలను నిత్యం స్మరిస్తాను.

**ఉ. రామహరే! కకుత్థ్సకుల రామహరే! రఘురామరామ శ్రీ**
**రామహరే! యటంచు మది రంజిల భేకగళంబులీల నీ**
**నామము సంస్మరించిన జనంబు భవం బెడబాసి తత్పరం**
**ధామ నివాసు లౌదురఁట దాశరథీ! కరుణాపయోనిధీ!! 16**

కరుణాసముద్రా! దశరథరామా! "హరే రామ! కాకుత్థ్స వంశంలో జన్మించిన శ్రీరామహరే! రఘుమహారాజు వంశంలో జన్మించిన రఘురామ రామ!" అని మనసులో ఆనందంగా మాటిమాటికి కప్పగొంతులా నీ నామస్మరణ చేసే నీ భక్తజనులకు (సకల పాపాలు, సంసారబాధలు తొలగిపోయి) జనన మరణ చక్రంనుండి విముక్తి కలిగి శాశ్వత ఆనందాన్ని ప్రసాదించే నీ పరమపదంలో నివసిస్తారు. (మోక్షాన్ని పొందుతారు).

* * *



# శ్రీకాళహస్తీశ్వర శతకము

**శ్రీకాళహస్తీశ్వర శతకాన్ని వ్రాసినవారు ధూర్జటి మహాకవి. ఈయన 1480-1530 మధ్యకాలంలో విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజ కవుల్లో ఒకడు. శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యం, శ్రీకాళహస్తీశ్వర శతకము ఈయన రచనలు. ధూర్జటి పరమ శివభక్తుడు.**

**శా. వాణీవల్లభ దుర్లభంబగు భవ ద్వారంబునన్నిల్చి, ని**
**ర్వాణశ్రీ చెరపట్టచూచిన విచారద్రోహమో, నిత్య క**
**ళ్యాణ క్రీడలబాసి, దుర్దశలపాలై, రాజలోకాధమ**
**శ్రేణీద్వారము దూరజేసె తిపుడో శ్రీకాళహస్తీశ్వరా! 1**

స్వామీ! శ్రీకాళహస్తీశ్వరా! సరస్వతీదేవి భర్త అయిన బ్రహ్మకు కూడా సాధ్యంకాని నీ వాకిటిముందు నిలబడి మోక్షం అనే లక్ష్మీదేవిని పొందాలని ఆలోచించడమే నేను చేసిన నేరమేమో! అందుకే ఇప్పుడు నిత్యం శుభకార్యక్రమాలను నిర్వహించాల్సిన నన్ను ఈ అధములైన రాజుల ద్వారాలవద్ద నిలిచేలా చేశావు కదా!

**శా. అంతా మిథ్య తలంచిన, చూచిన నరుం డట్లౌటెరింగిన్ సదా**
**కాంతల్పుత్రులు నర్థముల్ తనువు నిక్కంబంచు మోహార్ణవ**
**భ్రాంతింజెంది చరించుగాని, పరమార్థంబైన నీయందు దా**
**చింతాకంతయు చింతనిల్పడు కదా శ్రీకాళహస్తీశ్వరా! 2**

స్వామీ! శ్రీకాళహస్తీశ్వరా! మనకు కనిపించేదంతా అశాశ్వతమైనదని మాయ అని తెలిసికూడా మానవుడు భార్య, బిడ్డలు, సంపదలు, శరీరం అంటూ భ్రాంతితో మోహంలో పడిపోతున్నాడు. శాశ్వతానందమైన

ముక్తిని ప్రసాదించే నీ గురించి చింతాకంతైనా ఆలోచించడం లేదు, మనసు నిల్పడం లేదు కదయ్యా! ఏమి చోద్యమయ్యా!

**మ. భవకేళీమదిరామదంబున మహాపాపాత్ముడై వీడు న**
**న్ను వివేకింపడటంచు, నేను నరకార్ణోరాశిపాలైన బ**
**ట్టవు, బాలుం డొకచోట నాటతమితోడ న్నూతగూలంగ దం**
**డ్రి విచారింపక యుండునా కటకటా! శ్రీకాళహస్తీశ్వరా! 3**

శ్రీకాళహస్తీశ్వరా! జననమరణాలనే ఆటలో మాయ అనే మద్యం త్రాగిన గర్వంతో మహాపాపాలను చేస్తూ నిన్ను పూజించడం లేదని భావించి నరకానికి దగ్గరవుతున్నా కూడా నన్ను పట్టించుకోకపోతే ఎలా స్వామీ! కుమారుడు ఆడుకుంటూ పొరపాటున బావిలోపడితే తండ్రి అలానే పట్టించుకోకుండా ఉండిపోతాడా? అయ్యయ్యో! ఇదేమి స్వామీ. ఉద్ధరించి రక్షింపవయ్యా!

**మ. నిను సేవింపగ నాపదల్పొడమనీ, నిత్యోత్సవంబబ్బనీ,**
**జనమాత్రుండననీ, మహాత్ముడననీ, సంసార మోహంబు పై**
**కొననీ, జ్ఞానముగల్గనీ, గ్రహగతుల్ కుందింపనీ, మేలు వ**
**చ్చిన రానీ యవి నాకు భూషణములే శ్రీకాళహస్తీశ్వరా! 4**

శ్రీకాళహస్తీశ్వరా! నిన్ను సేవించడంవల్ల నాకు ఆపదలు కలిగినా కలగనీ, ఉత్సవాలు జరిగినా జరుగనీ, వీడు సామాన్య మానవుడు అన్నా అననీ, మహాత్ముడు అన్నా అననీ, సంసారమనే మోహం (భ్రాంతి) కలిగినా కలగనీ, జ్ఞానం కలిగినా కలగనీ, గ్రహగతులు అనుకూలించక పోయినా పోనీ, మంచి జరిగినా జరగనీ, చెడు జరిగినా జరగని అవన్నీ నాకు ఆభరణాలే అవుతాయి.



**శా. ఏ వేదంబు పఠించెలూత, భుజగం బే శాస్త్రముల్‌సూచె, దా**
**నే విద్యాభ్యసనం బొనర్చెగరి, చెం చేమంత్రమూహించె, బో**
**ధావిర్భావనిధానముల్ చదువు లయ్యా? కావు, మీ పాదసం**
**సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా! 5**

స్వామీ! శ్రీకాళహస్తీశ్వరా! నిన్ను సేవించిన సాలెపురుగు ఏ వేదాన్ని చదివిందయ్యా! పాము ఏ శాస్త్రాన్ని పలికింది? ఏనుగు ఏ విద్యను నేర్చుకున్నది? చెంచు (బోయవాడైన తిన్నడు) ఏ మంత్రంతో నిన్ను అర్చించాడు. అన్నిటికీ మూలకారణమైన నిన్ను గురించి తెలుసుకోవడానికి ఈ జీవకోటికి ఒకరు బోధించగా నేర్చుకున్న విద్యవల్ల సాధ్యమా! కాదు. కేవలం నీ పాదాలను అర్చించాలనే గట్టి కోరికవల్ల మాత్రమే అది సాధ్యమవుతుంది.

**శా. నిన్నే రూపముగా భజింతు మదిలో నీ రూపు మోకాలొ స్త్రీ**
**చన్నో, కుంచమొ, మేకపెంటికయొ ఆ సందేహముల్మాన్పి నా**
**కన్నారన్భవదీయమూర్తి సగుణా కారంబుగా జూపవే**
**చిన్నీరేజ విహార మత్తమధుపా శ్రీకాళహస్తీశ్వరా! 6**

శ్రీకాళహస్తీశ్వరా! నిన్ను ఈ మనసులో ఏ రూపంలో స్మరించుకోవాలి? ఒక భక్తునికి మోకాలిరూపంలో దర్శనమిచ్చావు. మరొకనికి స్త్రీస్తనరూపంలో దర్శనమిచ్చావు, వేరొకనికి ధాన్యం కొలిచే కుంచెరూపంలో కనిపించావు, ఇంకొకరికి మేకపెంటిక రూపంలో దర్శనమిచ్చావు. నీ అసలురూపం ఎలా గుర్తించేది? చిదాకాశమనే హృదయపద్మంపై వ్రాలి మకరందాన్ని ఆస్వాదించడంచేత మత్తెక్కిన షట్పదమా నాకు కరచరణాలుగల సగుణాకారంగా దర్శనం ప్రసాదించవయ్యా శివా!

**శా. నీ రూపంబు దలంపగా తుదమొద ల్లేగాన నీవైనచో**
**రారారమ్మనియంచు చెప్పవు వృథారంభంబు లింకేటికిన్**
**నీరమ్మంపుము పాలముంపు మిక ని న్నే నమ్మినాడంజుమీ**
**శ్రీరామార్చితపాదపద్మయుగళా శ్రీకాళహస్తీశ్వరా! 7**

శ్రీరామునిచేత అర్చించబడిన పాదపద్మాలు కల శ్రీకాళహస్తీశ్వరా! నీ నిజరూపాన్ని ఊహించి ఆది అంతాలు నేను కనుగొనలేను. నీవేమో నన్ను రమ్మని పిలువవు. నా ప్రయత్నాలన్నీ విఫలమే అవుతున్నాయి. నిన్నే నమ్ముకున్నాను. నీటముంచినా పాలముంచినా నీదే భారం దేవా!

**శా. నిన్నున్నమ్మినరీతి నమ్మ నొరులన్, నీకన్న నాకెన్న లే**
**రన్నల్దమ్ములు, తల్లిదండ్రులు గురుం డాపత్సహాయుండు, నా**
**యన్నా! యెన్నడు నన్ను సంసృతి విషాదాంభోధి దాటించి య**
**ఛ్ఛిన్నానంద సుఖాబ్ధి దేల్చెదొకదే! శ్రీకాళహస్తీశ్వరా! 8**

శ్రీకాళహస్తీశ్వరా! నిన్ను నమ్మినట్లు నేను ఇంకొకరిని నమ్మను. నీకన్నా నాకు ఇంకెవరూ అన్నదమ్ములు, తల్లిదండ్రులు, గురువులు, ఆపదలో ఆదుకునే మిత్రులు లేరు. నన్ను ఈ జన్మ జరాదుఃఖసాగరాల నుండి కడతేర్చి నీ అనంతమైన ఆనందసుఖసాగరంలో ఎప్పుడు కలుపుకొంటావో కదా! అని ఎదురుచూస్తున్నాను.

**మ. కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవనభ్రాంతులై!**
**కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రునకనేకుల్, వారిచే నేగతుల్**
**పడసెన్? పుత్రులులేని యా శుకునకున్ వాటిల్లెనే దుర్గతుల్**
**చెడునే మోక్షపదం బపుత్రకునకున్ శ్రీకాళహస్తీశ్వరా! 9**

శ్రీకాళహస్తీశ్వరా! కొందరు అవివేకులు అజ్ఞానంతో అశాశ్వతమైన ఈ సంసారవ్యామోహంలో పడి కొడుకులు పుట్టలేదని బాధపడతారు.



కౌరవుల రాజైన ధృతరాష్ట్రునికి వందమంది కొడుకులు పుట్టారు కదా! అతను ఏ సద్గతిని పొందాడు? పుత్రులే లేని ఆ శుకమహర్షికి ఏ దుర్గతులు కలిగాయి? పుత్రులు లేనివారికేమైనా మోక్షం రాకుండా ఉంటుందా? (శుకునికి వచ్చింది కదా!)

**శా. దినముంజిత్తములో సువర్ణముఖరీతీరప్రదేశామ్రకా**
**నన మధ్యోపలవేదికాగ్రమున నానందంబునం పంకజా**
**సననిష్ఠ న్నిను జూడగన్న నదివో సౌఖ్యంబు, లక్ష్మీవిలా**
**సిని మాయానటనల్ సుఖంబులగునే శ్రీకాళహస్తీశ్వరా! 10**

శ్రీకాళహస్తీశ్వరా! ప్రతిరోజూ పవిత్ర సువర్ణముఖీ నదీతీరంలో ఉండే మామిడితోట మధ్యలో రాతి అరుగుపైన ఆనందంతో నిష్ఠగా పద్మాసనం వేసుకుని కూర్చుని నిన్ను దర్శిస్తే అదే సౌఖ్యం. అంతే కానీ జగత్తును తన వైష్ణవీ తేజస్సుచే కప్పిన లక్ష్మీదేవియొక్క మాయా నటనలు నాకు సౌఖ్యప్రదాయకాలు కావయ్యా! శ్రీకాళహస్తీశ్వరా! నీవు ఆ మాయను గెలిచినవాడవు. నన్ను కావవయ్యా!.

**శా. పాలుం బువ్వయు బెట్టెదన్ గుడువరా పాపన్న, రాయన్న, లే**
**లే లెమ్మన్న, నరంటిపండ్లు గొనితే, లేకున్న నే నొల్లనం**
**టే, లాలింపరె తల్లితండ్రులపుడ ట్లే తెచ్చి వాత్సల్య ల**
**క్ష్మీ లీలా వచనంబులం గుడుపరా శ్రీకాళహస్తీశ్వరా! 11**

శ్రీకాళహస్తీశ్వరా! తల్లిదండ్రులు పిల్లలకు 'నాయనా పాలన్నం తినిపిస్తాను త్వరగా రారా నాన్నా!' అంటే పిల్లలు 'కాదు అరటిపండు ఇస్తే కానీ తినను' అనగా తల్లిదండ్రులు పండు ఇచ్చి అన్నం తినిపిస్తారు కదా! అలాగే నీవే నా తల్లివి తండ్రివి కూడా! కనుక నన్ను చిన్నపిల్లవానిగా లాలించే బాధ్యత నీదే సుమా!

**మ. ఒకరింజంపి పదస్థులై బ్రతుక తా మొక్కొక్క రూహింతు రే**
**లొకొ తామెన్నడు జావరో తమకు బో వో సంపదల్ పుత్ర మి**
**త్ర కళత్రాదులతోడ నిత్యసుఖమందం గందురో, యున్నవా**
**రికి లేదో మృతి యెన్నడుం గటకటా! శ్రీకాళహస్తీశ్వరా! 12**

శ్రీకాళహస్తీశ్వరా! కొందరు స్వార్థంచేత పదవులు, రాజ్యాలను మరొకరిని చంపి సాధిస్తుంటారు. అలాంటివారికి చావు రాకుండా ఉంటుందా? సంపదలు పోకుండా ఉంటాయా! భార్యాపిల్లలు, సంపదలూ శాశ్వతమైనవా? సంపదలున్నంతమాత్రాన వారికి చావు రాకుండా ఉంటుందా?

**శా. రాజుల్మత్తులు, వారిసేవ నరక ప్రాయంబు, వారిచ్చు నం**
**భోజాక్షీ చతురంతయానతురగీ భూషాదు లాత్మవ్యథా**
**బీజంబుల్, తదపేక్ష చాలు, పరితృ ప్తిం బొందితిన్, జ్ఞాన ల**
**క్ష్మీజాగ్రత్పరిణాహ మిమ్ము, దయతో శ్రీకాళహస్తీశ్వరా! 13**

శ్రీకాళహస్తీశ్వరా! రాజులు ధనమదంచేత గర్వంతో ప్రవర్తించేవారు. వారిని సేవించడం నరకంతో సమానమైంది. వారిచ్చే స్త్రీలు, పల్లకీలు, గుర్రాలు, ఆభరణాలు మనోవ్యధకు దారితీస్తాయి. నాకు వాటిపై కోరికలు నశించిపోయాయి. సంతృప్తి పొందాను. ఇక చాలు. శాశ్వత ఆనందాన్నిచ్చే మోక్షానికి సాధనమైన జ్ఞానాన్ని దయతో నాకు ప్రసాదించు స్వామీ!

**శా. రాజై దుష్కృతిచెందె చందురుడు, రా రాజై కుబేరుండు దృ**
**గ్రాజీవంబునగాంచె దుఃఖము, కురు క్ష్మాపాలు డామాటనే**
**యాజింగూలె సమస్త రాజబంధువులతో నారాజశబ్దంబు ఛీ,**
**ఛీ! జన్మాంతరమందు నొల్లను జుమీ శ్రీకాళహస్తీశ్వరా! 14**



శ్రీకాళహస్తీశ్వరా! చంద్రుడు రాజైకూడా కళంకాన్ని పొందాడు. ధనాధిపతి అయిన కుబేరుడు రారాజై కూడా దేహాన్ని చెడగొట్టుకుని దుఃఖించాడు. కౌరవుల రాజైన దుర్యోధనుడు రారాజవడంవల్లనే రాజబంధువులందరితో కలిగి యుద్ధంలో ప్రాణాలు విడిచాడు. జన్మజన్మలకు కూడా ఛీ ఛీ నాకు 'రాజు' అనే శబ్దమే వద్దు స్వామీ!

**శా. రాజర్థాతురుడైనచో నెచట ధర్మంబుండు? నే రీతి నా**
**నాజాతి క్రియలేర్పడున్? సుఖము మాన్యశ్రేణికెట్లబ్బు? రూ**
**పాజీవాళికి నేది దిక్కు? ధృతి నీ భక్తుల్ భవత్పాద నీ**
**రేజంబుల్ భజియింతు రే తెఱగునన్! శ్రీకాళహస్తీశ్వరా! 15**

శ్రీకాళహస్తీశ్వరా! రాజు ధనంపై వ్యామోహం ఉన్నవాడైతే ధర్మం ఎక్కడ ఉంటుంది? వర్ణాశ్రమ ధర్మాలు ఎలా ఏర్పడతాయి? గౌరవంతో జీవించేవారికి సుఖం ఎలా కలుగుతుంది? లలితకళల్ని ఆశ్రయించుకొని కళాకారులకు రక్షణ ఎక్కడ ఉంది? ఇక నీ భక్తులు ఏ ధైర్యంతో నీ పాదపద్మాలను సేవించుకోగలరు స్వామీ!

* * *

# భర్తృహరి నీతిశతకము

**సంస్కృత శతకవాఙ్మయం నుండి తెలుగులోకి వచ్చిన శతకాల్లో భర్తృహరి నీతిశతకం ప్రధానమైంది. సంస్కృతంలో భర్తృహరి రాసిన సుభాషిత త్రిశతిని తెలుగులో సుభాషితరత్నావళి పేరుతో ఎలకూచి బాలసరస్వతి, ఏనుగు లక్ష్మణకవి, పుష్పగిరి తిమ్మనలు అనువదించారు. ప్రస్తుత పద్యాలు ఏనుగు లక్ష్మణకవి అనువదించిన సుభాషిత త్రిశతిలోని నీతిశతకం లోనివి. ఈయన 17వ శతాబ్దానికి చెందినవాడు. రామేశ్వర మాహాత్మ్యము, విశ్వామిత్ర చరిత్ర, గంగామాహాత్మ్యము, రామవిలాసము మొదలైనవి ఈయన ఇతర రచనలు.**

**తే. బోద్ధ లగువారు మత్సరపూర్ణమతులు**
**ప్రబలగర్వవిదూషితుల్ ప్రభువు లెన్న**
**నితరమనుజు లబోధోపహతులు గాన**
**భావమున జీర్ణమయ్యె సుభాషితంబు. 1**

పండితులందరూ అసూయతో నిండిన హృదయాలతో ఉన్నారు. పాలకులైన మహారాజులు తమ బలగర్వంతో విర్రవీగుతున్నారు. ఇక సామాన్య ప్రజలు ఏమి చెప్పినా తెలుసుకోలేని స్థితిలో అణగి మణిగి ఉన్నారు. కాబట్టి, నేను చెప్పదలచుకున్న మంచిమాట కూడా నా హృదయకోశంలోనే అంతరించింది (ఆగిపోయింది).

**క. తెలియనిమనుజుని సుఖముగఁ**
**దెలుపం దగు, సుఖతరముగ తెలుపఁగ వచ్చున్**
**దెలిసినవానిం; దెలిసియుఁ**
**దెలియనినరుఁ దెల్ప బ్రహ్మదేవునివశమే. 2**



ఏమీ తెలియనివానికి తెలియజేయడం సులభం. పూర్తిగా తెలిసిన వానికి కూడా మళ్ళీ తెలియజేయడం సులభమే. కానీ తెలిసీతెలియని వానికి (మిడి మిడి జ్ఞానంతో ఉండి సర్వజ్ఞుడిగా భావించుకునేవానికి) తెలియజేయడం బ్రహ్మదేవునికైనా సాధ్యం కాదు కదా!

**చ. తెలివి యొకింత లేనియెడ దృప్తుఁడనై కరిభంగి సర్వమున్**
**దెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితిఁ దొల్లి యిప్పుడు**
**జ్ఞులమతులైన పండితుల సన్నిధి నించుక బోధశాలినై**
**తెలియనివాఁడనై మెలఁగితిం గతమయ్యె నితాంతగర్వమున్. 3**

పూర్వం నేను కొద్దిపాటి జ్ఞానంకూడా లేనప్పుడు సర్వస్వము తెలిసిన సర్వజ్ఞుడనని ఏనుగువలె గర్వంతో విర్రవీగాను. కానీ మహాజ్ఞానులైన పండితుల వద్ద ఇప్పుడు కొద్దిగా తెలుసుకొని నేను పూర్వం ఎంత తెలివిలేని మూర్ఖునిగా మెలిగానో తెలుసుకున్నాను. అంతులేని నా గర్వం తొలగిపోయింది.

**తే. తివిరి యిసుమునఁదైలంబుఁదీయవచ్చుఁ**
**దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ**
**దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ**
**జేరి మూర్ఖులమనసు రంజింపరాదు. 4**

బాగా ప్రయత్నం చేస్తే ఇసుకనుండైనా నూనెను తీయవచ్చు. ఎండమావుల్లోనైనా కష్టపడి నీటిని సాధించి త్రాగవచ్చు. చాలాశ్రమపడి తిరిగిన దానికి ఫలితంగా కుందేటి కొమ్మును కూడా సాధించవచ్చు కానీ ఎన్ని రాత్రింబవళ్లు శ్రమించినా మూర్ఖుని మనసును మాత్రం ఆనందాన్ని కలిగించలేము.

**శా. ఆకాశంబుననుండి శంభునిశిరం, బందుండి శీతాద్రి సు**
**శ్లోకంబైనహిమాద్రి నుండి భువి, భూలోకంబునందుండి య**
**స్తోకాంభోధి పయోధినుండి, పవనాంధోలోకముం జేరె గం**
**గాకూలంకష పెక్కు భంగులు వివేకభ్రష్టసంపాతముల్. 5**

గంగాప్రవాహం ఆకాశంనుండి శివుని తలపైకి, అక్కడినుండి హిమవత్పర్వతంపైకి, గొప్పగా కీర్తించబడే స్వచ్ఛమైన హిమాలయాలపై నుండి భూమిపైకి, భూలోకం నుండి సముద్రంలోనికి, సముద్రంలో నుండి పాతాళలోకానికి చేరింది. అలాగే బుద్ధిహీనులైన వారుకూడా ఉన్నతోన్నత స్థానంనుండి అనేకవిధాలుగా దిగజారుతూ అధోగతి పాలవుతారు.

**ఉ. హర్తకుఁగాదు గోచర మహర్నిశమున్ సుఖపుష్టిసేయు స**
**త్కీర్తి ఘటించు విద్య యనుదివ్యధనం బఖిలార్థికోటికిం**
**బూర్తిగ నిచ్చినన్ బెరుఁగుఁబోదు యుగాంతపువేళనైన భూ**
**భర్తలు తద్ధనాధికుల పట్టున గర్వము మాను టొప్పగున్. 6**

విద్య అనే దివ్యమైన ధనం దొంగలకు కనిపించనిది. అది ఎల్లపుడూ సుఖాన్ని కలిగించేది. కీర్తిని తెచ్చిపెట్టేది. ఈ విద్యాధనాన్ని అడిగినవారందరికీ ఇచ్చేకొద్దీ వృద్ధి చెందుతూ (పెరుగుతూ) ఉంటుందే కానీ తరిగిపోదు. ఈ లోకం అంతరించినా విద్య ఉంటుంది. విద్యకు చావులేదు. సాధారణ సంపదలున్న మహారాజులైనా విద్య అనే దివ్యసంపదలున్న పండితులపట్ల తమ అహంకారం ప్రదర్శించకూడదు.



**చ. వనజభవుండు కోపమున వాహనమైన మరాళభర్తకున్**
**వనజవనీవిహారకలనంబు దొలంగఁగఁజేయుఁగాని, గుం**
**భనమున దుగ్ధజీవన విభాగ విధాననిరూఢనైపుణీ**
**జనితమహాయశోవిభవసారము హంసకు మాన్పఁజాలునే. 7**

పద్మంనుండి పుట్టిన బ్రహ్మదేవుడు తనకు కోపంవస్తే తన వాహనమైన హంసను పద్మాలుండే సరస్సులో తిరగకుండా చేయగలడే కానీ దాని సహజమైన పాలను, నీటిని వేరుచేసే గుణాన్ని తీసివేయలేడు కదా!

**ఉ. విద్యనిగూఢగుప్త మగు విత్తము, రూపము పూరుషాళికిన్,**
**విద్య యశస్సు, భోగకరి, విద్య గురుండు, విదేశబంధుఁడున్**
**విద్యవిశిష్టదైవతము విద్యకు సాటి ధనంబు లే దిలన్**
**విద్య నృపాలపూజితము విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే. 8**

ప్రజలందరికీ విద్య దాచిపెట్టి ఇచ్చిన ధనం. విద్య చదువుకున్న వారికి ఒక రూపాన్ని ఇస్తుంది. విద్య కీర్తిని, భోగభాగ్యాలను ప్రసాదిస్తుంది. విద్యే గురువు. విద్య విదేశాల్లో మన బంధువు. విద్య ఒక విశిష్టమైన భగవత్ స్వరూపం. విద్యకు సమానమైన ధనం ఈ లోకంలో లేదు. విద్య రాజులచేత పూజింపబడుతుంది. ఇంత మహత్తరమైన విద్యను తెలుసుకోలేని మనిషి మనిషికాదు.

**తే. సత్యసూక్తి ఘటించు, ధీ జడిమ మాన్చు**
**గౌరవ మొసంగు, జనులకుఁగలుష మడఁచుఁ**
**గీర్తిఁబ్రకటించు, చిత్తవిస్ఫూర్తిఁజేయు**
**సాధుసంగంబు సకలార్థసాధనంబు. 9**

సజ్జన సహవాసం (మంచివారితో కలిసి ఉండడం) మంచి మాటలను మాట్లాడిస్తుంది. బుద్ధిమాంద్యాన్ని (తెలివిలేనితనాన్ని) పోగొడుతుంది. గౌరవాన్ని తెచ్చిపెడుతుంది. జనుల పాపాలను నశింపజేస్తుంది. కీర్తిని విస్తరింపజేస్తుంది. మనసుకు ఆనందాన్ని కలిగిస్తుంది. సజ్జనులతో సహవాసం అన్ని కోరికలను నెరవేర్చే సాధనం.

**క. సుకృతాత్ములు రససిద్ధులు**
**సుకవీంద్రులు విజయనిధులు సుమ్ము, తదీయా**
**ధికకీర్తిశరీరంబులు**
**ప్రకటజరామరణజన్మ భయరహితంబుల్. 10**

మహాత్ములైన కవిశ్రేష్ఠులు తమ రచనలలో నవరసాలను పండించగల గొప్ప నేర్పు కలవారు. వారు విజయానికి నిధివంటివారు. తమ గొప్పకీర్తి అనే శరీరంతో జన్మ జరామరణాలనే భయాలను జయించి ఎల్లప్పుడూ ప్రకాశిస్తూ ఉంటారు.

**ఉ. గ్రాసము లేక స్రుక్కిన జరాకృశమైన విశీర్ణమైన సా**
**యాసమునైన నష్టరుచి యైనను బ్రాణభయార్తమైన ని**
**స్త్రాసమదేభకుంభపిశితగ్రహలాలసశీలసాగ్రహా**
**గ్రేసరభాసమాన మగు కేసరి జీర్ణతృణంబు మేయునే? 11**

పరాక్రమానికి ప్రతిరూపమైన సింహం తినడానికి తిండిలేక ఎండిపోయినా, ముసలితనంచేత బక్కచిక్కినా, కండలు కోల్పోయినా, ప్రాణాలు పోతున్నాకూడా మదించిన ఏనుగు కుంభస్థలాన్ని కొట్టి తినాలని ప్రయత్నిస్తుందే కానీ తనప్రక్కనే అందుబాటులో ఉన్న గడ్డినిమాత్రం తినదు.



**చ. జలముల నగ్ని, ఛత్రమునఁ జండమయూఖుని, దండతాడనం**
**బుల వృషగర్ధభంబులును, బొల్పగుమత్తకరీంద్రమున్ సృణిం**
**జెలఁగెడురోగ మౌషధముచే, విషముం దగుమంత్రయుక్తి ని**
**మ్ములఁ దగఁజక్కఁజేయనగు మూర్ఖుని మూర్ఖత మాన్పవచ్చునే. 12**

నీటిచేత అగ్నిని, గొడుగుచేత సూర్యుని ఎండతాపాన్ని, కర్రచేత, ఎద్దులను, గాడిదలను, అంకుశంచేత మదించిన ఏనుగును, ఔషధంచేత రోగాలను, సరైన మంత్రంచేత విషాన్ని అదుపు చేయవచ్చు (లేదా) నివారించవచ్చు. కానీ మూర్ఖుని మూర్ఖత్వాన్నిమాత్రం పోగొట్టలేము (లేదా) నివారించలేము.

**ఉ. భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగదతారహారముల్**
**భూషితకేశపాశమృదు పుష్పసుగంధ జలాభిషేకముల్**
**భూషలు గావు, పూరుషుని భూషితుఁ జేయుఁ బవిత్రవాణి, వా**
**గ్భూషణమే సుభూషణము, భూషణముల్ నశియించు నన్నియున్. 13**

మానవునికి భుజకీర్తులు, రత్నాలహారాలు మొదలైన ఆభరణాలు అందంగా తీర్చిదిద్దబడిన, అలంకరించబడిన నల్లటి వెంట్రుకలు, పూలు, గంధం, సుగంధజలాలు – ఇవేవీ అలంకారాలు కావు. నోటినుండి వచ్చే చల్లటి అందమైన వాక్కు మనిషిని పవిత్రునిగా చేస్తుంది. వాక్కు ఇచ్చిన అలంకారం మరేదీ ఇవ్వదు. వాక్కు అనే ఆభరణమే ఆభరణం. తక్కినవన్నీ నశించిపోయేవే. ఆడినమాట మాత్రమే నిలబడుతుంది.

**చ. క్షమ కవచంబు, క్రోధ మది శత్రువు, జ్ఞాతి హుతాశనుండు, మి**
**త్రము దగుమందు, దుర్జనులు దారుణపన్నగముల్, సువిద్య వి**
**త్తముచితలజ్జ భూషణ, ము దాత్తకవిత్వము రాజ్య మీక్షమా**
**ప్రముఖపదార్థముల్ గలుగు పట్టునఁదత్క వచాదు లేటికిన్. 14**

మానవునికి ఓర్పే రక్షించే కవచం. కోపం ఉంటే శత్రువుతో పనేలేదు. దాయాది ఉంటే చాలు నిప్పు అవసరం లేదు. మంచి స్నేహితుడుంటే వైద్యునితో పనిలేదు. దుర్జనులుంటే చాలు దారుణమైన విషసర్పాలతో కూడా పనేలేదు. మంచి విద్య ధనాన్ని సంపాదించి పెడుతుంది. తగిన సిగ్గు ఆభరణంలాంటిది. గొప్ప కవిత్వం రాజ్యమే మరి. ఓర్పువంటివన్నీ ఉంటే మనిషికి వేరే కవచాలు అవసరం లేదు.

**తే. ప్రాణిలోకంబు సంసార పతిత మగుట**
**వసుధపైఁగిట్టిపుట్టని వాఁడు గలఁడె**
**వానిజన్మంబు సఫలమె వ్వానివలన**
**వంశమధికోన్నతి వహించి వన్నెకెక్కు. 15**

ఈ లోకంలో ప్రాణులన్నీ సంసారమనే చక్రంలో పడి పుడుతూ, చస్తూ ఉంటాయి. ఈ భూమిపై చచ్చి పుట్టని చావనివారెవరైనా ఉన్నారా? ఇలా పుట్టినవారిలో ఎవనివల్ల పుట్టిన వంశానికి కీర్తి, గొప్ప పేరు కలుగుతుందో వాని జన్మమాత్రమే సఫలమౌతుంది.

**మ. భువనశ్రేణి వహించు శేషుఁడు ఫణా భోగంబుపై సంతతం**
**బవలీలన్ భరియించుఁబృష్ఠమునఁగూర్మాధీశ్వరుం డాతనిన్**
**ధవళక్రోడవశాత్ముఁజేయు నతనిన్వారాశి యశ్రాంతిచే**
**నవురా! ధీరచరిత్రసంపద లసంఖ్యాతప్రభావోన్నతుల్. 16**



సమస్త భువనాలను (లోకాలను) ఆదిశేషుడు తన పడగలపై మోస్తూ ఉన్నాడు. ఆదిశేషుడిది అవలీలగా ఆదికూర్మ అవతారి అయిన శ్రీహరి తన వీపుపై నిలిపి ఉంచాడు. సాగరుడు ప్రళయకాలంలో ఆదికూర్మాన్ని సైతం శ్వేతవరాహస్వామి ఆధీనంలోకి తెస్తున్నాడు. ఆహా! మహాత్ముల మహిమలు అసంఖ్యాకాలు కదా!

**క. విదలింప నుఱుకు సింగపుఁ**
**గొదమయు మదమలినగండ కుంజరములపై**
**నిది బలశాలికి నైజము**
**గద తేజోనిధికి వయసు కారణమగునే. 17**

సింహపు పిల్లలు చిన్నవి అయినా కూడా చెక్కిళ్ళనుండి మదం కారుతున్న మదగజాలను చూస్తే పరుగెత్తి వాటిపైకి దుమికి పంజాతోకొట్టి చావుదెబ్బ తీస్తాయి. బలవంతుల సహజలక్షణం అది. పరాక్రమానికి వయసుతో సంబంధమేమీ లేదు.

**ఉ. జాతి దొలంగుఁగాత, గుణ శక్తి రసాతలసీమకుం జనుం**
**గాత, కులంబు బూది యగుఁగాత, నగంబుననుండి శీలముం**
**బాతముఁ జెందుఁగాత, బహుభంగుల విత్తమె మాకు మేలు వి**
**ఖ్యాతగుణంబు లెల్లఁదృణకల్పము లొక్కధనంబు లేవడిన్. 18**

జాతి (కులం) చెడినా చెడిపోనీ, మంచిగుణాలు పాతాళానికి అణచివేసినా అణచివేయుగాక, కులం (వంశం) కాలిబూడిదైనా అయిపోగాక. శీలం ఉన్నత శిఖరంనుండి దొరలిపడిపోయినా పడిపోవుగాక. ఎన్నివిధాలా ఏమి జరిగినా కూడా మాకు ధనమే అన్నిటికిన్నా ప్రధానమైంది. ఒక్క ధనం లేకపోతే గొప్ప గొప్ప గుణాలన్నీ గడ్డిపరకలతో సమానం.

**మ. యతి సంగంబున, బాలుఁడాదరముచే, జ్యాభర్త దుర్మంత్రిచే,**
**శ్రుతిహీనిన్ద్విజుఁ, దన్వయంబు ఖలుచేఁ, గ్రూరాప్తిచే శీల, ము**
**ద్ధతిచే మిత్రత, చూపులేమిఁగృషి, మద్యప్రాప్తిచే సిగ్గు, దు**
**ర్మతిచే సంపదలున్ నశించుఁ, జెడు నర్థంబుల్ ప్రమాదంబునన్. 19**

(స్త్రీ) సాంగత్యంవల్ల యతి (సన్యాసి), అధిక ప్రేమచేత బాలురు, రాజు తప్పుడు సలహాలిచ్చే మంత్రివల్ల, బ్రాహ్మణుడు వేదాధ్యయనం లేకపోవుటచేత, వంశం దుర్మార్గునిచేత, కులం దుష్టునిచేత, నడవడిక చెడుమాటలచేత, స్నేహం గర్వంచేత, వ్యవసాయం ముందుచూపు లేకపోవుట చేత, సిగ్గు మద్యం త్రాగడంచేత, సంపదలు చెడుబుద్ధిచేత, ధనం ప్రమాదాలచేత నశిస్తూ ఉంటాయి.

**తే. కారణము లేని కలహంబు, గరుణలేమి,**
**పరవధూ, పరధనవాంఛ, బంధుసాధు**
**జనములం దసహిష్ణుత్వ, మనఁగ జగతిఁ**
**బ్రకృతిసిద్ధంబు లివి దుష్టనికరమునకు. 20**

ఈ లోకంలో ఏ కారణమూ లేకుండా గొడవపడడం, ఎదుటి వారిపట్ల కొంతైనా కరుణ చూపకపోవడం, పరస్త్రీలను, పరుల ధనాన్ని కావాలని కోరుకోవడం, బంధువులపట్ల, మంచివారిపట్ల ఓర్వలేని గుణాన్ని కలిగి ఉండడం అనే ఈ గుణాలు దుర్మార్గులకు పుట్టుకతోనే వస్తాయి.

**తే. విద్యచే భూషితుం డయి వెలయుచున్నఁ**
**దొడరి వర్జింపనగుఁ జుమీ దుర్జనుండు**
**చారుమాణిక్యభూషిత శస్తమస్త**
**కంబయిన పన్నగము భయంకరము గాదె. 21**



దుష్టస్వభావం కలవాడు విద్యావంతుడై ఎంత పేరు ప్రఖ్యాతులు పొందినా వాడిని వదిలేయవలసిందే. చేరదీయరాదు. అందమైన, విలువైన మణి భయంకరమైన విషసర్పం తలపై ఉంటే దాన్ని పొందేందుకు ఎవ్వరూ ప్రయత్నించరు కదా!

**ఉ. మౌనముచేత మూఁగయు, సమంచితవక్త ప్రలాపి, చెంగటం**
**బూనివసింప దిట్ట, దమముందట దవ్వుగ నుండెనేని శా**
**లీనుఁడు దాల్మి భీరుఁ, దవలిష్టుఁడు దాలిమి లేనిబంటు, భూ**
**జానులసేవ దుష్కరమ సాధ్యము యోగులకైన నిద్దరన్. 22**

సేవకుడు ఏమీ మాట్లాడకపోతే మూగవాడనీ, చక్కగా మాట్లాడుతున్నట్లైతే వదరుబోతు అనీ, దగ్గరగా ఉంటే భయభక్తులు లేనివాడనీ, దూరంగా ఉంటే చేతకాని వాడని, ఎన్ని కష్టాలైనా ఓర్చుకొనే స్వభావంతో ఉంటే పిరికివాడనీ, ఎదురుతిరిగితే గర్విష్ఠి అనీ భావించే రాజుల దగ్గర సేవ చేయడం యోగులకు కూడా అసాధ్యమే.

**తే. మొదలఁజూచినఁ గడు గొప్ప పిదపఁగుఱుచ,**
**యాదిఁగొంచెము తర్వాత నధిక మగుచుఁ,**
**దనరు, దినపూర్వపరభాగ జనితమైన**
**చాయపోలికఁగుజనసజ్జనులమైత్రి. 23**

చెడ్డవారితో స్నేహం ఉదయకాలపు నీడవలె ముందు పొడవుగా ఉండి రాను రాను తగ్గిపోతుంది. అదే మంచివారితో స్నేహం సాయంకాలపు నీడవలె ముందు చిన్నదిగా ఉన్నా ఆ తర్వాత పెరిగి పెరిగి పెద్దదవుతుంది.

**ఉ. ఆపదలందు ధైర్యగుణ, మంచిసంపదలందుఁ దాల్మియున్,**
**భూపసభాంతరాళమునఁ, బుష్కలవాక్చతురత్వ, మాజి బా**
**హాపటుశక్తియున్, యశమునం దనురక్తియు, విద్యయందు వాం**
**ఛాపరివృద్ధియున్, బ్రకృతి జన్యగుణంబులు సజ్జనాళికిన్. 24**

ఆపద (కష్టాల్లో) లో ఉన్నప్పుడు ధైర్యం, సిరిసంపదలు బాగా ఉన్నప్పుడు ఓర్పు, రాజుల సభామధ్యంలో పుష్కలమైన మాటకారితనం, యుద్ధంలో పరాక్రమం, కీర్తిని పొందుటలో ఆసక్తి, విద్యను పొందుటలో గట్టి కోరికను (పట్టుదలను) కలిగి ఉండుట అనునవి సజ్జనులకు పుట్టుకతో అబ్బిన గుణాలు.

**తే. తరువు లతిరసఫలభార గురుతఁగాంచు**
**నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘుఁ,**
**దుద్ధతులు గారు బుధులు సమృద్ధిచేత;**
**జగతి నుపకర్తలకు నిది సహజగుణము. 25**

ఈ లోకంలో చెట్లు ఫలాలతో నిండి ఉన్నప్పుడు బరువుతో భూమిపైకి వంగి ఉంటాయి. మేఘాలు నీటితో బరువెక్కినప్పుడు భూమి దగ్గరగా వ్రేలాడుతుంటాయి. సజ్జనులు తమకు సంపదలు వచ్చినప్పుడు గర్వంచేత విర్రవీగకుండా నమ్రతతో పరోపకార పరాయణులై ప్రవర్తిస్తారు. ఇది వారి సహజ లక్షణం.

**తే. తనిసిరే వేల్పు లుదధిరత్నములచేత?**
**వెఱచిరే ఘోరకాకోల విషముచేత?**
**విడిచిరే యత్న మమృతంబు వొడముదనుక?**
**నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు. 26**



అమృతంకోసం క్షీరసాగరాన్ని మథిస్తున్న సమయంలో వచ్చిన రత్నాలచేత దేవతలు సంతోషించారా? ఘోరమైన కాలకూటవిషం పుట్టినపుడేమైనా భయపడ్డారా? అమృతాన్ని సాధించేవరకు వారి ప్రయత్నాన్ని ఏమైనా వదిలిపెట్టారా? లేదు కదా! అలాగే నిపుణులైనవారు సాధించాలనుకున్న కార్యాన్ని సాధించేవరకు విడవరు.

**శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై,**
**యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్,**
**ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచున్ ధృత్యున్నతోత్సాహులై**
**ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్గావునన్. 27**

నీచమానవులు (అధములు) ఎదురయ్యే ఆటంకాలను దృష్టిలో పెట్టుకొని (ఆలోచిస్తూ) ఏ పనినీ ప్రారంభించరు. మధ్యములు ప్రారంభించి మధ్యలో ఆటంకాలు వస్తే ఆ పనిని వదిలిపెట్టేస్తారు. ధీరులు చేపట్టిన కార్యంలో ఎన్ని కష్టనష్టాలు ఎదురైనా నూతన ఉత్సాహంతో ముందుకు వెళతారే కానీ వదిలిపెట్టరు. కనుకనే వారిని ప్రజ్ఞ (నిపుణత)కు నిధివంటివారిగా భావిస్తారు.

**మ. ఒకచో నేలను బవ్వళించు, నొకచో నొప్పారుఁబూసెజ్జపై,**
**నొకచో శాకము లారగించు, నొకచో నుత్కృష్టశాల్యోదనం,**
**బొకచోఁబొంత ధరించు, నొక్కొకతఱిన్ యోగ్యాంబరశ్రేణి; లె**
**క్కకు రానీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్. 28**

ఒక కార్యాన్ని సాధించాలన్న పట్టుదల ఉన్నవాడు ఆ కార్యసాధనలో ఎన్ని కష్టసుఖాలొచ్చినా సమానంగానే స్వీకరిస్తాడు. ఒక్కోసారి నేలపైనే పడుకుంటాడు. ఒకసారి పూలపాన్పుపై పడుకుంటాడు. ఒకసారి చక్కగా వండిన రుచికరమైన ఆహారాన్ని స్వీకరిస్తాడు. ఒక్కోసారి పచ్చికూరగాయలే

తింటాడు. ఒకసారి పట్టువస్త్రాలను ధరిస్తాడు. ఒకసారి బొంతను ధరిస్తాడు. ఏది ఏమైనా కార్యసాధనే ముఖ్యం.

**చ. ఉరుతరపర్వతాగ్రమున నుండి దృఢం బగుఱాతి మీఁద స**
**త్వరముగఁ ద్రెళ్లి కాయము హతంబుగఁజేయుట మేలు, గాలిమే**
**పరిదొరవాతఁగేలిడుట బాగు, హుతాశనమధ్యపాతమున్**
**వర మగుఁ, జారుశీలగుణ వర్జన మర్హము గాదు చూడఁగన్. 29**

ఎత్తైన పర్వతం మీదినుండి పెద్దరాయిమీదకు వేగంగా దూకి ఈ శరీరాన్ని వదలవచ్చు. భయంకరమైన విషజ్వాలలను వెదజల్లే ఆదిశేషుని నోటిలో చేయి పెట్టుట మేలు, ప్రచండమైన అగ్నికీలలమధ్య దూకి చావడం మేలు కానీ ఆలోచించి చూడగా మంచిగుణాలను మాత్రం వదిలిపెట్టడం తగిన పని కాదు.

**తే. ఖండితం బయ్యు భూజంబు వెండి మొలచు,**
**క్షీణుఁడయ్యును నభివృద్ధిఁజెందు సోముఁ,**
**డివ్విధమున విచారించి యొడలు దెగిన**
**జనములకుఁదాప మొందరు సాధుజనులు. 30**

పూర్తిగా నరకబడిన చెట్టు మళ్ళీ చిగురిస్తుంది. అమావాస్య నాటికి పూర్తిగా క్షీణించిన చంద్రుడు మళ్ళీ వృద్ధి చెందుతాడు. వీటిని గమనించిన సజ్జనులు ఎన్ని కష్టాలు, దుఃఖాలు వచ్చినా బాధపడరు.

**క. కందుకమువోలె సుజనుఁడు**
**గ్రిందం బడి మగుడ మీఁదికి న్నెగయుఁజుమీ,**
**మందుఁడు మృత్పిండమువలెఁ**
**గ్రిందం బడి యడఁగి యుండుఁగృపణత్వమునన్. 31**



బంతి ఎలాగైతే క్రిందకు పడినా మళ్ళీ పైకి లేస్తుందో అలాగే సజ్జనుడు హీనమైన స్థితిలోకి పడిపోయినా తిరిగి ఉన్నత స్థితిలోకి వస్తాడు. మట్టిముద్ద క్రిందకు పడితే ఎలా పైకి లేవలేదో అలాగే మూర్ఖుడు కూడా తన మూర్ఖత్వంవల్ల హీనస్థితి నుండి ఉన్నత స్థితిని పొందలేడు.

**చ. సలిలముఁజొచ్చినం, గనక శైలముఁజేరిన, వైరివీరులం**
**గెలిచిన, రాజసేవఁదిలకించిన, వేదము లభ్యసించినం,**
**గళల తెఱంగెటింగిన, ఖగత్వము దాల్చినఁ, గర్మనిఘ్నతా**
**కలన నభావ్యమైన పని గాదు వినాశము లేదు భావికిన్. 32**

నీటిలో ప్రవేశించినా, బంగారు కొండ అయిన మేరుపర్వతంపైకి ఎక్కినా, శత్రువీరులను గెలిచినా, రాజుల సేవలను చూచినా, వేదాలను అభ్యసించినా కళలపై మంచి అవగాహన కలిగి ఉన్నా, పక్షివలే ఆకాశంలో ఎగిరినా, కర్మకు లోబడి ఉండాల్సిందే కానీ చేసిన కర్మనుండి తప్పించుకోవడం ఎవ్వరికీ సాధ్యంకాదు. కర్మ నాశం లేనిది.

* * *

# కుమార శతకము

ఈ శతకాన్ని వ్రాసిన వారు శ్రీ పక్కి లక్ష్మీనరసింహ కవి. ఈయనకే అప్పల నరసయ్య అని మరోపేరు. ఈయన 18వ శతాబ్దానికి చెందినవాడు. ఈయన బాలలకొరకు కుమార శతకాన్ని, బాలికల కొరకు కుమారీ శతకాన్ని వ్రాశారు. నీతిబోధ, లోకానుభవం ఈ శతకాలలోని ముఖ్య ఉద్దేశ్యం. కవి ఈ శతకాలలో పిల్లల బాధ్యతతోపాటు పిల్లల పపట్ల వారి తల్లిదండ్రుల బాధ్యతను కూడా బాగా వివరించాడు.

**క. ఆజ్ఞ యొనర్చెడి వృత్తుల**
**లో జ్ఞానము గలిగి మెలగు లోకులు మెచ్చన్**
**బ్రాజ్ఞతను గలిగి యున్నన్**
**బ్రాజ్ఞులలోఁబ్రాజ్ఞుఁడవుగ ప్రబలు కుమారా! 1**

కుమారా! నిన్ను చేయమని నియమించిన పనులను తెలివితేటలను ఉపయోగించి లోకంలోని ప్రజలందరూ మెచ్చుకొనేటట్లుగా చేయాలి. ఆ పనిలో బుద్ధి నైపుణ్యాన్ని ప్రదర్శిస్తే నీవుకూడా తెలివైనవారిలో తెలివి గలవాడుగా కీర్తిని పొందగలవు.

**క. అతి బాల్యములో నైనను**
**బ్రతికూలపు మార్గములఁబ్రవర్తింపక స**
**ద్గతి మీర మెలగ నేర్చిన**
**నతనికి లోకమున సౌఖ్య మగును గుమారా! 2**

కుమారా! మరీ చిన్నవయసులోనైనా సరే చెడుమార్గాల్లో నడవకుండా మంచి మార్గాల్లోనే నడవాలి. బాల్యంనుండే మంచి ప్రవర్తనతో నడుచుకునేవారికి ఈ లోకంలో సుఖం లభిస్తుంది.



**క. వృద్ధజన సేవ చేసిన**
**బుద్ధి విశేషజ్ఞుదివ్యపూత చరిత్రున్**
**సద్ధర్మశాలియని బుధు**
**లిద్ధరఁబొగడెదరు ప్రేమ యెసగఁగుమారా! 3**

కుమారా! ఈ లోకంలో ముసలివారికి సేవలు చేస్తే సాధుజనులు అతనికి బుద్ధిమంతుడనీ, పవిత్రమైన నడవడిక కలవాడని, చక్కగా ధర్మాన్ని అనుసరించేవాడని, ప్రేమతో కీర్తిస్తారు.

**క. పెద్దలు వద్దని చెప్పిన**
**పద్దుల బోవంగరాదు, పరకాంతల నే**
**పొద్దే నెదఁబరికించుట**
**కుద్దేశములుఁగూడ దుర్విఁ గుమారా! 4**

కుమారా! పెద్దవాళ్ళు చేయవద్దని చెప్పిన పనులను పంతంతో చేయడానికి ప్రయత్నించరాదు. పరస్త్రీలను గురించి ఏ సమయంలోనైనా సరే మనసులో కూడా తలుచుకోరాదు.

**క. ఉన్నను లేకున్నను పై**
**కెన్నడు మర్మంబుఁదెలుప నేగకుమీ నీ**
**కన్నతలిదండ్రుల యశం**
**బెన్నఁబడెడు మాడ్కిఁదిరుగు మెలమిఁగుమారా! 5**

కుమారా! నీకేదైనా రహస్యం తెలిసినా, తెలియకపోయినా బయటకు ఎవరితోనూ చెప్పబోకు సుమా! నీ తల్లిదండ్రుల గౌరవం నాలుగుదిక్కులా వ్యాపించేలా నడుచుకోవాలి.

క. పెద్దలు విచ్చేసినచో
బద్ధకముననైన దుష్టపద్ధతి నైనన్
హద్దెరిగి లేవకున్నన్
మొద్దువలెను జూతు రతని ముద్దు కుమారా! 6

కుమారా! పెద్దలెవరైనా నీ దగ్గరకు వచ్చినపుడు సోమరితనం వలనకానీ, చెడుబుద్ధివలన కానీ గౌరవించి లేవకపోతే వారు నిన్ను మొద్దువలే చూస్తారు (అవివేకివలే చూస్తారు).

క. సతతముఁ బ్రాతః కాలో
చిత విధులను జరుపు మరసి శీఘ్రముగ నహః
పతి పూర్వపర్వతాగ్రా
గతుడగుటకు మున్నె వెరవు గల్గి కుమారా! 7

కుమారా! సూర్యుడు తూర్పు కొండపై ఉదయించడానికి ముందే నిద్రనుండి లేచి ఉదయకాలంలో చేయాల్సిన పనులను త్వరితగతిని చేసుకోవాలి.

క. పోషకుని మతముఁగనుగొని
భూషింపక గాని ముదము బొందరు మఱియున్
దోషముల నెంచు చుందురు
దోషివయిన మిగులఁగీడు దోచుఁ గుమారా! 8

కుమారా! నిన్ను పోషిస్తున్న యజమానికి అభిప్రాయం తెలుసుకొని అతణ్ణి పొగడితే ఆయన సంతోషిస్తాడు. లేకపోతే నీ పనిలో తప్పులనే వెదుకుతూ ఉంటారు. తప్పు దొరికితే నీకు కీడును తలపెడతారు.



క. పుడమిని దుష్టత గల యా
తడు లంచంబులను బట్ట దలచుచు మిడియౌ
నడవడి విడి యందరి వెం
బడిఁద్రిప్పికొనుచును గీడు పరుప కుమారా! 9

కుమారా! దుర్మార్గపు బుద్ధి కలిగినవాడు అధికార గర్వంచేత లంచం తీసుకోదలచినవాడై, తన అవసరం ఉన్నవారిని మాటిమాటికి తనచుట్టూ త్రిప్పుకుంటూ ఇబ్బందులకు గురి చేస్తుంటారు.

క. పనులెన్ని కలిగి యున్నను
దినదినమున విద్యపెంపు ధీయుక్తుడవై
వినగోరుము సత్కథలను;
కని విబుధులు సంతసించు గతినిఁ గుమారా! 10

కుమారా! ఎన్ని పనులున్నా విద్యపట్ల శ్రద్ధను కలిగి పెద్దవాళ్ళు మెచ్చుకొనే రీతిగా ప్రతిరోజూ చక్కగా చదువుకోవాలి. మంచి విషయాలను ప్రతిరోజూ విని తెలుసుకోవాలి. జ్ఞానాన్ని పెంచుకోవాలి.

క. ధరణీ నాయకు రాణియు
గురు రాణియు నన్నరాణి కులకాంతను గ
న్న రమణి దనుగన్నదియును
ధర నేవురు తల్లులనుచుఁ దలపు కుమారా! 11

కుమారా! రాజ్యాన్ని పాలించే రాజుయొక్క భార్య, గురువుగారి భార్య, అన్నగారి భార్య, నీ భార్యను కన్నతల్లి, నిన్ను కన్నతల్లి – వీరు ఐదుగురు తల్లులుగా భావించాలి.

క. **సదమల మతితోఁబెద్దల**
**మదికింపుగ మెలగు, నిందమానుము పరులన్**
**మృదుమార్గములను వదలకు**
**విదితంబుగ దానఁగీర్తి వెలయుఁ గుమారా! 12**

కుమారా! మంచిబుద్ధిని కలిగి పెద్దవాళ్ళ మనసులకు ఆనందం కలిగేలా నడుచుకోవాలి. ఇతరులను నిందించడం మానుకోవాలి. మంచి మార్గాన్ని విడిచిపెట్టరాదు. అప్పుడే వాడి కీర్తి విస్తరిస్తుంది.

క. **ఆచార్యున కెదిరింపకు**
**బ్రోచిన దొరనింద సేయఁబోకుము కార్యా**
**లోచనము నొందఁ జేయకు**
**మాచారము విడువఁ బోకుమయ్య! కుమారా! 13**

కుమారా! గురువులను ఎదిరించి మాట్లాడరాదు, నిన్ను పోషించే యజమానిని నిందించరాదు, చేసే పనిని గురించి అనేకవిధాలుగా ఆలోచించరాదు. మంచి ప్రవర్తనను విడిచిపెట్టరాదు.

క. **కల్లలగు మాట లాడకు**
**మెల్లజనంబులకు వేగ హృదయము కడు రం**
**జిల్లగఁ బల్కుము నీ కది**
**తెల్లము రహిఁగీ ర్తిఁగాంచు దెరగు కుమారా! 14**

కుమారా! అసత్యపు మాటలు మాట్లాడకు. ప్రజలందరి మనసులు వెంటనే ఆనందపడేట్లుగా మాట్లాడాలి. అదే నీకు స్వచ్ఛమైన కీర్తిని, ఆనందాన్ని పెంచే మార్గం.



క. **ఏనాడైనను వినయము**
**మానకుమీ మత్సరమున మనుజేశులతోఁ**
**బూనకు మసమ్మతయి బహు**
**మానమునను బొందు మిదియె మతము కుమారా! 15**

కుమారా! ఏ రోజైనా సరే వినయాన్ని వదులుకోకు. రాజులపై మాత్సర్యంతో వారికి వ్యతిరేకమైన పనులను చేయకు. ఇదే గౌరవాన్ని సన్మానాన్ని (బహుమానాన్ని) పొందే మార్గం.

క. **నగఁగూడదు పరసతిఁగని**
**తగ మాతృ సమానమెన్నదగు; నెవ్వరితోన్ఁ**
**బగ గూడ, దొరుల నిందిం**
**పగఁగూడదు, గనుము వృద్ధ పథము కుమారా! 16**

కుమారా! ఇతరుల భార్యలను చూచి నవ్వరాదు. వారిని తల్లితో సమానంగా భావించాలి. ఎవరితోనూ విరోధాన్ని పెంచుకోవద్దు. ఇతరులను నిందించరాదు. ఇది పెద్దలు అనుసరించిన మార్గమని తెలుసుకో.

క. **చేయకుము కాని కార్యము**
**పాయకుము మతిన్ శుభం బవని భోజనమున్**
**జేయకుము రిపు గృహంబున**
**గూయకు మొరుమనసు నొచ్చుగూత కుమారా! 17**

కుమారా! ఈ భూమిమీద చేయకూడని పనులను చేయవద్దు మరియు శుభకార్యాలను విడిచిపెట్టవద్దు. శత్రువుల ఇంట్లో భోజనం చేయవద్దు. ఇతరుల మనసులను బాధపెట్టేలా మాట్లాడవద్దు.

క. తనయుడు చెడుగై యుండిన
జనకుని తప్పన్న మాట సత్యమెఱుగుదు గా
వున నీ జననీ జనకుల
కు నపఖ్యాతి యగురీతి గొనకు కుమారా! 18

కుమారా! పుత్రుడు దుర్మార్గుడైతే (చెడ్డవాడైతే) ఆ తప్పు తండ్రిదే అనేమాట నిజమని తెలుసు. కనుక నీ తల్లిదండ్రులకు అపకీర్తి తెచ్చేలా ప్రవర్తించకు.

క. తల్లిని దండ్రిని సహజుల
నల్లరి బెట్టినను వార లలుగుచు నీపై
నుల్లమున రోయు చుందురు
కల్లరి వీడనుచుఁగీర్తిఁగందఁగుమారా! 19

కుమారా! జన్మనిచ్చిన తల్లిదండ్రులను, తోడబుట్టినవారిని అల్లరిపాలు చేయరాదు. వారు నీపై కోపంతో బాధపడుతూ మనసులో అసహ్యించుకుంటారు. వీడు అబద్ధాలకోరు అంటూ నీకున్న మంచిపేరును చెడగొడ్తారు.

క. వగవకు గడచిన దానికి
పొగడకు దుర్మతుల నెపుడు; పొసగని పనికై
యొగి దీనత నొందకుమీ
తగ దైవగతిం బొసంగు ధరను కుమారా! 20

కుమారా! జరిగిపోయిన విషయాన్ని గురించి చింతించరాదు. చెడుబుద్ధి కలవారిని గూర్చి పొగడరాదు. జరగని పనికి ప్రయత్నించి బాధపడవద్దు. ఈ లోకంలో భగవంతుడు ఎలా నిర్ణయిస్తే అలానే జరుగుతుంది.



క. ఒరులెవ్వరేని దనతో
బరిభాషించినను మేలు పలుక వలయు నా
దరము గల చోటఁగీడును
కరము నొనర్పంగరాదు గదర కుమారా! 21

కుమారా! ఇతరులు ఎవరైనా నీతో వ్యంగ్యంగా (నిందిస్తూ) మాట్లాడినా నీవు మాత్రం వారితో మంచిగానే మాట్లాడాలి. గౌరవం కలిగి ఉన్నవారి చోట కీడును కొని తెచ్చుకోరాదు కదా! (మంచిగా ఉన్నవారిని చెడు చేసుకోరాదని భావం).

క. తిరుగకు దుర్మార్గులతో
నరుగకు గహనాంతరస్థలాదుల కొంటన్
జరుగకు శత్రుల మ్రోల
న్మరువకు మేల్ హితులయెడల మదిని కుమారా! 22

కుమారా! దుర్మార్గులతో కలిసి తిరగవద్దు. ఒంటరిగా అటవీ ప్రదేశానికి వెళ్ళవద్దు. శత్రువుల వైపుకు వెళ్ళకు. ఉపకారం చేసినవారిని మనసులో ఎప్పటికీ మరచిపోవద్దు.

క. పెను కోపము గర్వము ను
బ్బును జపలము దురభిమానము నిర్వ్యాపారం
బునుఁ జౌరవ మునికియును న
ల్పుని గుణము లటంచు దెలివిబొందు కుమారా! 23

కుమారా! విపరీతమైన కోపం, గర్వం, విపరీతంగా పొంగి పోవడం, మనసు నిలకడగా ఉండకపోవడం, విపరీతమైన అహంకారం, ఏ పనీపాట లేకపోవడం, విపరీతమైన చౌరవ అనేవి నీచుని లక్షణాలుగా తెలుసుకో.

క. సద్గోష్ఠి సిరియు నొసగును
సద్గోష్ఠియె కీర్తి బెంచు సంతుష్టిని నా
సద్గోష్ఠియె యొనగూర్చును
సద్గోష్ఠియె పాపములను జంపు కుమారా! **24**

కుమారా! సజ్జనులతో సల్లాపం సంపదలను ప్రసాదిస్తుంది. గొప్ప కీర్తిని తెచ్చిపెడుతుంది. ఆ సజ్జన సల్లాపమే ఆనందాన్ని కలుగజేస్తుంది. అదే సజ్జనసల్లాపం పాపాలను కూడా పోగొడుతుంది.

క. జ్ఞానుల చరితము వీనుల
నానుచు సత్పురుష గోష్ఠి ననఘంబనుచున్
బూనుము; ధర్మపథంబును
దా నెరిగినయంత; మరువదగదు కుమారా! **25**

కుమారా! వివేకవంతుల చరిత్రలను చెవులారా శ్రద్ధగా వింటూ, సజ్జన సల్లాపం పాపవిముక్తులను చేస్తుందని తెలుసుకుంటూ, ధర్మాన్ని తప్పకుండా తెలిసినంత వరకు ధర్మమార్గంలోనే జీవితాన్ని కొనసాగించాలి.

క. సభలోపల నవ్విన యెడ
సభవార్నిరసింతు రెట్టి జనుడు న్నెరి నీ
కభయం బొసంగె నేనియు
ప్రభుకరుణను నమ్మి గర్వపడకు కుమారా! **26**

కుమారా! సభలో నవ్వడం పనికిరాదు. అలా నవ్వినవారిని అందరూ వ్యతిరేక భావనతో చూస్తారు. ఎంత రాజాశ్రయానికి పాత్రుడైనా గర్వంతో ప్రవర్తించకుండా నడచుకోవాలి.



# నరసింహ శతకము

**నరసింహ శతకాన్ని వ్రాసిన వారు శేషప్ప కవి. ఇది భక్తి ప్రబోధక శతకం. స్వీయానుభవాలు, లోకనీతులు పుష్కలంగా ఉన్న శతకం.**

సీ. నరసింహ! నీ దివ్యనామ మంత్రముచేత
దురితజాలము లెల్లఁ దోలవచ్చు,
నరసింహ! నీ దివ్యనామ మంత్రముచేత
బలువైన రోగముల్ బాపవచ్చు,
నరసింహ నీ దివ్య నామమంత్రముచేత
రిపు సంఘముల సంహరింపవచ్చు,
నరసింహ నీ దివ్యనామ మంత్రముచేత
దండహస్తుని బంట్లఁ దఋమవచ్చు,

తే. భళిర! నే నీ మహామంత్ర బలముచేత
దివ్య వైకుంఠ పదవి సాధించవచ్చు!
భూషణ వికాస శ్రీధర్మ పురనివాస
దుష్ట సంహార నరసింహ దురిత దూర! **1**

పవిత్రమైన ధర్మపురిలో నివాసం ఉంటూ వివిధ ఆభరణాలతో ప్రకాశిస్తూ, పాపాలను బూడిద చేస్తూ దుష్టులను శిక్షిస్తున్న ఓ నరసింహా! పవిత్రమైన నీ నామమంత్రం చేత సకల పాప సమూహాలను దూరం చేయవచ్చు. పవిత్రమైన నీ నామమంత్రం చేత తీవ్రమైన రోగాలను నయం చేయవచ్చు. పవిత్రమైన నీ నామమంత్రం చేత శత్రువుల సమూహాన్ని హతమార్చవచ్చు. పవిత్రమైన నీ నామమంత్రం చేత

యమభటులను తరిమి కొట్టవచ్చు. భళిరా! నేను ఈ మహామంత్ర బలంచేత దివ్యవైకుంఠంలో స్థానాన్ని సంపాదించవచ్చు.

**సీ. చిత్తశుద్ధిగ నీకు సేవఁజేసెదఁ గాని,**
**పుడమిలో జనుల మెప్పులకు గాదు,**
**జన్మ పావనతకై స్మరణ జేసెదఁగాని,**
**సరివారిలోఁ ప్రతిష్ఠలకుఁగాదు,**
**ముక్తికోసము నేను మ్రొక్కి వేఁడెదఁగాని,**
**దండిభాగ్యము నిమిత్తంబుగాదు,**
**నిన్నుఁ బొగడ విద్య నేర్చితినే కాని,**
**కుక్షి నిండెడు కూటి కొఱకుఁగాదు,**

**తే. పారమార్థికమునకు నేఁ బాటుపడితిఁ**
**గీర్తికి నపేక్ష పడలేదు కృష్ణవర్ణ!**
**భూషణ వికాస శ్రీధర్మ పురనివాస**
**దుష్టసంహార నరసింహ దురిత దూర! 2**

పవిత్రమైన ధర్మపురిలో నివాసం ఉంటూ వివిధ ఆభరణాలతో ప్రకాశిస్తూ, పాపాలను బూడిద చేస్తూ దుష్టులను శిక్షిస్తున్న నల్లని ఛాయ కలిగిన ఓ నరసింహా! స్వచ్ఛమైన మనస్సుతో నేను నీకు సేవలు చేస్తున్నానే కానీ ఈ లోకంలోని ప్రజలతో పొగిడించుకునేందుకు కాదు. ఈ జన్మను పావనం చేసుకునేందుకే నిన్ను స్మరిస్తున్నాను కానీ, నా తోటి వారిలో గౌరవాన్ని పొందేందుకు కాదు. మోక్షం పొందడం కోసం నీకు నమస్కరించి ప్రార్థిస్తున్నానే కానీ సంపదలకోసం కాదు. నిన్ను స్తుతించడంకోసం విద్యను నేర్చినానే కానీ కడుపు నింపే కూడుకోసం



కాదు. ముక్తిని సాధించడానికి నేను కృషి చేశానే కానీ పేరు ప్రఖ్యాతులను నేను కోరలేదు.

**సీ. గార్దభంబున కేల కస్తూరి తిలకంబు?**
**మర్కటంబున కేల మలయజంబు?**
**శార్దూలమున కేల శర్కరాపూపంబు?**
**సూకరంబునకేల చూతఫలము?**
**మార్జాలమున కేల మల్లెపువ్వులబంతి?**
**గుడ్లగూబల కేల కుండలములు?**
**మహిషంబు కేల నిర్మలమైన వస్త్రముల్?**
**బకసంతతికి నేల పంజరంబు?**

**తే. ద్రోహచింతనఁ జేసెడి దుర్జనులకు**
**మధురమైనట్టి నీ నామ మంత్రమేల?**
**భూషణ వికాస శ్రీధర్మ పురనివాస**
**దుష్టసంహార నరసింహ దురిత దూర! 3**

పవిత్రమైన ధర్మపురిలో నివాసం ఉంటూ వివిధ ఆభరణాలతో ప్రకాశిస్తూ, పాపాలను బూడిద చేస్తూ దుష్టులను శిక్షిస్తున్న ఓ నరసింహా! గాడిదకు కస్తూరి తిలకం, కోతికి మంచి గంధం, పులికి తీయటి పిండివంటలు, పందికి మామిడిపండు, పిల్లికి సువాసనలు వెదజల్లే మల్లె పూబంతులు, గుడ్లగూబలకు చెవికమ్మలు, దున్నపోతులకు స్వచ్ఛమైన వస్త్రాలు, కొంగల గుంపుకు పంజరాలు ఎలా అనవసరమో అలాగే ద్రోహం చేయాలని ఆలోచించే దుర్మార్గులకు మధురమైన నీ నామమంత్రం అవసరం లేదు.

సీ. పసరంబు పంజైనఁ బసులకాపరితప్పు,
ప్రజలు దుర్జనులైనఁ బ్రభువు తప్పు,
భార్య గయ్యాళైనఁ బ్రాణనాథుని తప్పు,
తనయుఁడు దుడుకైనఁ దండ్రి తప్పు,
సైన్యంబు చెదరిన సైన్యనాథుని తప్పు,
కూఁతురు చెడుగైన మాత తప్పు,
అశ్వంబు దురుసైన నారోహకుని తప్పు,
దంతి మదించ మావంటి తప్పు,

తే. ఇట్టితప్పు లెఱుంగక యిచ్చవచ్చి
నటుల మెలగుదు రిప్పు డీ యవని జనులు;
భూషణ వికాస శ్రీధర్మ పురనివాస
దుష్టసంహార నరసింహ దురిత దూర! 4

పవిత్రమైన ధర్మపురిలో నివాసం ఉంటూ వివిధ ఆభరణాలతో ప్రకాశిస్తూ, పాపాలను బూడిద చేస్తూ దుష్టులను శిక్షిస్తున్న ఓ నరసింహా! పశువు సోమరిదైతే అది పశులకాపరిది తప్పు. ప్రజలు చెడ్డవారైతే అది రాజు తప్పు. భార్య గయ్యాళిదైతే అది మగని తప్పు. కొడుకు చెడ్డవాడైతే అది తండ్రి తప్పు. సైన్యము చెదిరిపోతే అది సైన్యాధిపతి తప్పు. కూతురు దుర్మార్గురాలైతే అది తల్లి తప్పు. గుఱ్ఱం పొగరు గలదైతే అది రౌతు తప్పు. ఏనుగు పొగరెక్కినదైతే అది మావటి తప్పు. ఈ భూమిపై ఉండే ప్రజలు ఇటువంటి తప్పులను తెలుసుకోలేక ఇష్టం వచ్చినట్లుగా ప్రవర్తిస్తున్నారు.



సీ. తనువులోఁ బ్రాణముల్ తరలిపోయెడి వేళ
నీ స్వరూపమును ధ్యానించు నతఁడు
నిమిషమాత్రములోన నిన్నుఁ జేరునుగాని,
యమునిచేతికిఁ జిక్కి శ్రమలఁబడఁడు;
పరమసంతోషాన భజనఁ జేసెడివాని
పుణ్య మేమనవచ్చు భోగిశయన!
మోక్షము నీ దాస ముఖ్యుల కగు గాని
నరక మెక్కడిదయ్య నళిననేత్ర!

తే. కమలనాభుని మహిమలు కానలేని
తుచ్ఛులకు ముక్తి దొరకుట దుర్లభంబు;
భూషణ వికాస శ్రీధర్మ పురనివాస
దుష్టసంహార నరసింహ దురిత దూర! 5

పవిత్రమైన ధర్మపురిలో నివాసం ఉంటూ వివిధ ఆభరణాలతో ప్రకాశిస్తూ, పాపాలను బూడిద చేస్తూ దుష్టులను శిక్షిస్తున్న ఓ నరసింహా! ఈ శరీరం నుండి ప్రాణాలు బయటకు వెళ్ళిపోయేముందు నీ ఆకారాన్ని తలచుకొనేవాడు ఒక్క నిమిష కాలంలోనే నిన్ను చేరుకుంటాడు కానీ యముడిచేతికి చిక్కి కష్టాలు పడడు. ఓ సర్పశయనా! పరమానందంతో నిన్ను గూర్చి భజనచేసే వాని పుణ్యమును ఏమని పొగడవచ్చు. నిన్ను కొలిచే దాసానుదాసులకు మోక్షం వస్తుందే కాని నరకం ఎందుకు ప్రాప్తిస్తుందయ్యా పద్మనేత్రా! పద్మాన్ని నాభియందు కలవాడైన శ్రీహరి మహిమలను చూడలేని నీచులకు మోక్షం దొరకడం అసాధ్యం.

సీ. నీలమేఘశ్యామ! నీవె తండ్రివి మాకు,
కమలవాసిని మమ్ముఁ గన్నతల్లి,
నీ భక్తవరులంత నిజమైన బాంధవుల్,
నీ కటాక్షము మా కనేక ధనము,
నీ కీర్తనలు మాకు లోక ప్రపంచంబు,
నీ సహాయము మాకు నిత్య సుఖము,
నీ మంత్రమే మాకు నిష్కళంకపు విద్య,
నీ పద ధ్యానంబు నిత్య జపము

తే. తోయజాతాక్ష! నీ పాద తులసిదళము
రోగముల కౌషధము బ్రహ్మరుద్ర వినుత!
భూషణ వికాస శ్రీధర్మ పురనివాస
దుష్ట సంహార నరసింహ దురిత దూర! 6

పవిత్రమైన ధర్మపురిలో నివాసం ఉంటూ వివిధ ఆభరణాలతో ప్రకాశిస్తూ, పాపాలను బూడిద చేస్తూ దుష్టులను శిక్షిస్తున్న ఓ నరసింహా! నల్లటి మబ్బులఛాయ కలిగినవాడా! మాకు నీవే తండ్రివి. కమలంలో నివసించే మహాలక్ష్మీదేవి మమ్మల్ని కన్నతల్లి. నీ భక్తజనులే మా నిజమైన బంధువులు. నీ చల్లనిచూపే మాకు అంతులేని సంపద. నిన్ను గురించి పొగడే కీర్తనలే మాకు ప్రపంచం. నీ సహాయమే మాకు మచ్చలేని స్వచ్ఛమైన విద్య. నీ పాదాలను ధ్యానించడమే మాకు నిత్య జపం. కలువరేకులవంటి కన్నులు కలవాడా! బ్రహ్మరుద్రాదులచేత స్తుతింపబడేవాడా! ఓ నారసింహా! నీ పాదాలపై ఉండే తులసీదళమే అన్ని రోగాలను నివారించే దివ్యమైన ఔషధం.



సీ. బ్రతికినన్నాళ్ళు నీ భజన తప్పను గాని,
మరణకాలమునందు మఱతునేమొ?
యావేళ యమదూత లాగ్రహంబున వచ్చి
ప్రాణముల్ పెకలించి పట్టునపుడు
కఫ వాత పైత్యముల్ కప్పఁగా భ్రమచేతఁ
గంప ముద్భవమంది, కష్టపడుచు
నా జిహ్వతో నిన్ను నారాయణా! యంచుఁ
బిలుతునో! శ్రమచేతఁ బిలువలేనొ

తే. నాటి కిప్పుడె చేసెద నామభజనఁ
దలఁచెదను జేరి వినవయ్య! ధైర్యముగను,
భూషణ వికాస శ్రీధర్మ పురనివాస
దుష్ట సంహార నరసింహ దురిత దూర! 7

పవిత్రమైన ధర్మపురిలో నివాసం ఉంటూ వివిధ ఆభరణాలతో ప్రకాశిస్తూ, పాపాలను బూడిద చేస్తూ దుష్టులను శిక్షిస్తున్న ఓ నరసింహా! స్వామీ! బ్రతికి ఉన్నన్నాళ్ళూ నిన్ను కీర్తించడం, స్మరించడం మరచిపోను కానీ, మరణించేకాలంలో మరచిపోతానేమో! ఆ సమయంలో యమదూతలు వచ్చి కోపంతో నా ప్రాణాల్ని తీసుకువెళ్ళేవేళ కఫం, వాతం, పైత్యం నన్ను బాధించగా సంసారమనే మాయతో వణుకుతూ, కష్టపడుతూ నా నాలుకతో నిన్ను నారాయణా! అని పిలువగలనో? పిలువలేనో? కనుక ఆరోజుకుకూడా ఇప్పుడే ధైర్యంగా నీ నామాన్ని స్మరిస్తాను. కీర్తిస్తాను. దగ్గరకు వచ్చి వినవయ్యా!

**సీ. పాంచభౌతికము దుర్భరమైన కాయం బి**
**దెప్పుడో విడుచుట యెఱుకలేదు,**
**శతవర్షములదాఁక మితముఁ జెప్పిరి కాని,**
**నమ్మరాదామాట నెమ్మనమున!**
**బాల్యమందో; మంచి ప్రాయమందో; లేక**
**ముదిమియందో; లేక ముసలియందొ,**
**యూరనో, యడవినో, యుదక మధ్యముననో,**
**యెప్పుడో యేవేళ నే క్షణంబొ?**

**తే. మరణమే, నిశ్చయము; బుద్ధిమంతుఁడైన**
**దేహ మున్నంతలో మిమ్ముఁ దెలియవలయు;**
**భూషణ వికాస శ్రీధర్మ పురనివాస**
**దుష్ట సంహార నరసింహ దురిత దూర! 8**

పవిత్రమైన ధర్మపురిలో నివాసం ఉంటూ వివిధ ఆభరణాలతో ప్రకాశిస్తూ, పాపాలను బూడిద చేస్తూ దుష్టులను శిక్షిస్తున్న ఓ నరసింహా! ఈ శరీరం నీరు, నింగి, నేల, నిప్పు, గాలి అనే పంచభూతాలతో నిర్మితమైనదీ, భరించడానికి సాధ్యంకానిది. దీన్ని ఎప్పుడు విడిచిపెడతానో తెలియదు. వందేళ్ల ఆయువును పరిమితి పెట్టారుకానీ, మనసులో ఆ మాటను ఏమాత్రం నమ్మలేము. బాల్యంలోనో, మంచి యౌవనంలోనో, వయసుడిగినప్పుడో లేదా ముసలితనంలోనో, ఊరిలోనో, అడవిలోనో, నీళ్లమధ్యలోనో ఎప్పుడో, ఏ సమయంలోనో, ఏ క్షణంలోనో మరణించడం తప్పనిసరి. బుద్ధిమంతుడైనవాడు ప్రాణాలున్నప్పుడే మిమ్మల్ని గురించి తెలుసుకోవాలి స్వామీ!

* * *



# అనుబంధం
## పద్యానుక్రమణిక

### సుమతిశతకము

**శ్రీకృష్ణశతకము**

**దాశరథీశతకము**





**కాళహస్తీశ్వరశతకము**



**భర్తృహరి నీతిశతకము**

**కుమారశతకము**

**నరసింహశతకము**